

౬-2-1987న దక్షిణ భారత హిందీ ప్రచారసభ-ఆంధ్ర, హైదరాబాద్ భవనంలో జరిగిన హైదరాబాద్ హిందీ ప్రేమీమండలి ప్రమాణపత్ర వితరణోత్సవసభలో ఉపన్యసిస్తున్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆర్థిక శాఖామాత్యులు గౌ॥ శ్రీ పి. మహేంద్రనాథ్ గారు.



ఇటీవల ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారక మండలి ప్రధాన కార్యదర్శిగా ఎన్నికైన శ్రీ బి. అంజయ్యగారు, పొన్నూరు.




సాహిత్య మాస పత్రిక

# 395

మార్చి, 1987

సంపుటి : 33, సంచిక 12

వార్షికచందా : పదిహేను రూపాయలు

విడిప్రతి : రూపాయిన్నర

సంపాదకులు

ఎ. రామస్వామి

# ఈ సంచికలో

సంపాదకీయం

# స్వర్ణోత్సవ సందర్భం

దక్షిణ భారత హిందీ ప్రచార సభ- ఆంధ్ర ఏబది యేండ్లు పూర్తి చేసుకొని ఏబది ఒకటవ సంవత్సరం లోనికి అడుగు పెట్టింది. దీనితో దక్షిణాదిన హిందీ ప్రచారోద్యమం 68 సంవత్సరాలు పూర్తిచేసుకొన్నట్లయింది.

1918కి పూర్వం హిందీ ప్రచార ప్రసారాల లక్ష్యంతో సంస్థలు ఏర్పడక పోలేదు. కాశీ నాగరీ ప్రచారిణీ సభ, హిందీ సాహిత్య సమ్మేళన్, ప్రయాగ ఏర్పడి పనిచేసాయి, కాని దక్షిణ భారత హిందీ ప్రచార సభ లక్ష్యానికి వాటి లక్ష్యానికీ తేడా ఉన్నది. ఆ రెండు సంస్థలు ప్రధానంగా హిందీ మాట్లాడే రాష్ట్రాలలోనే హిందీ భాష స్థానాన్ని పదిలపరచడం కోసం ఏర్పడ్డాయి. హిందీకి స్వస్థలంలోనే గౌరవం లభ్యమయ్యేటట్లు చేయడం వాటి లక్ష్యం. ఆపని చేశాయికూడ. ఇక దక్షిణ భారత హిందీ ప్రచార సభ హిందీకి జాతీయ భాషా స్థానాన్ని కల్పించి తద్వారా దేశసమైక్యతా భావాన్ని ప్రోదిచేయడం కొరకు ఏర్పడింది. ఈ లక్ష్యంతోనే మహాత్ముడు 1918లో తమ కుమారుడు దేవదాసు గాంధీని మద్రాసు పంపించి జాతీయ భాషగా హిందీ ప్రచారోద్యమానికి, దక్షిణ భారత హిందీ ప్రచార సభకు శ్రీకారం చుట్టారు.

ఈ సభ ఆదిలో సాహిత్య సమ్మేళన సంస్థకు అనుబంధంగా ఉన్నా లక్ష్యభేదం కారణంగా త్వరలోనే విడివడి స్వతంత్ర సంస్థగా రూపొందింది. స్వతంత్రమయిన తరువాత సభ కార్యకలాపాలు శరవేగంతో అభివృద్ధినందగా దక్షిణాది నాలుగు భాషా ప్రాంతాలలోను ప్రాంతీయ శాఖల నేర్పరచి వాటి సహకారంతో హిందీ భాషా ప్రచారం గావింప సాగింది. ఈ దశలోనే దేశంలోని ఇతర రాష్ట్రాలలో కూడ ఆయా హిందీ ప్రచార సంస్థలు ఎర్పడి జాతీయ భాషా ప్రచారం కావిస్తూ వచ్చాయి. ఈ విధంగా దక్షిణ భారత హిందీ ప్రచార సభ తక్కిన హిందీ ప్రచార సంస్థల కన్నిటికి మార్గదర్శకమై హిందీకి జాతీయ భాషా స్థానాన్ని కల్పించడంలోను, దాని స్వరూప స్వభావాలను నిర్ధారణ చేయడంలోను, చేసి దానిని ప్రపంచ స్థాయి భాషల సరసన నిల్పడంలోను కీలకమైన పాత్రను నిర్వహించింది.

ఆంధ్రసభ 1936లో ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘం అను పేర ఏర్పడింది. అటు తరువాత నైజాము సంస్థానంలోని తెలుగు మాట్లాడే జిల్లాలను కలుపుకొని, 'దక్షిణ భారత హిందీ ప్రచార సభ- ఆంధ్ర' గా రూపొంది పనిచేస్తున్నది.

ఆంధ్ర సభ ప్రారంభంతో తెలుగునాట జాతీయ భాషా ప్రచారం మారుమూల గ్రామాలకు కూడ చేరుకుంది. మనరాష్ట్రంలోని జాతీయ పార్టీలన్నీ సభకు నైతికబలాన్ని, మద్దతును ఇచ్చాయి. అగ్రశ్రేణికి చెందిన నాయకులు సాహితీ పరులు, పత్రికాధిపతులు ఈ ఉద్యమానికి చేయూత నిచ్చారు. హిందీ ప్రచారం ఒక పవిత్రమైన నిర్మాణ కార్యక్రమంగా కొనసాగింది.

స్వాతంత్ర్య సంపాదనానంతరం హిందీభాష స్వరూప స్వభావాలను దానిని నేర్చుకొనే లక్ష్యంలోను కూడ మార్పు వచ్చింది. జాతీయతా పరిరక్షణతోపాటు ప్రయోజనాత్మక లక్ష్యం కూడ దానికి ఏర్పడింది. ఇప్పుడు మనకు ఆ భాషలో ఎంతో కొంత పరిజ్ఞానం మాత్రమే కాక, దానిలో నైపుణ్యం కలిగి ఉండడం కూడ అవసరమైంది. ఈ అవసరాన్ని గుర్తించి దక్షిణ భారత హిందీ ప్రచార సభ పార్లమెంటుద్వారా జాతీయ ప్రాధాన్యం గల సంస్థగా గుర్తింపు పొందటానికి ప్రయత్నించి సాధించింది. ఇప్పుడు దీనికి విశ్వవిద్యాలయ స్థాయి లభించి విస్తృతి నందసాగింది. హిందీలో కంప్యూటర్ కోర్సులను కూడ నిర్వహించే స్థాయికి ఎదిగింది.

అయితే ఇంత జరిగినా దక్షిణాదిన జాతీయ భాషగా హిందీని ప్రచారం చేయవలసిన అవసరం ముగియలేదు. అందుచే కేంద్ర సభ ప్రాంతీయ సభలు సంప్రదాయ పద్ధతిలో హిందీ భాషా ప్రచారం సాగిస్తూనే ఉన్నాయి. సాగిస్తూ ఉండాలి కూడాను. ఈ దృష్ట్యా ఈ సంవత్సరం అక్టోబరు నెలలో జరగబోయే ఆంధ్రసభ స్వర్ణోత్సవ కార్యక్రమాలు ఉద్యమానికి నవీనస్ఫూర్తి నిచ్చేవిగా తీర్చిదిద్దడానికి ప్రయత్నం జరుగుతోంది.

స్వర్ణజయంత్యుత్సవ సందర్భంలో (1) రెండు లక్షలమందికి పరిచయ పరీక్ష ద్వారా హిందీ నేర్పటం (2) తెలుగులోని 10 ఉత్తమ గ్రంధాలను హిందీలోనికి అనువదించి ప్రకటించడం, (3) స్వర్ణజయంతి భవన నిర్మాణం, (4) స్వర్ణ జయంతి స్మారిక (సావనీర్) ప్రకటన, (5) మూడు రోజుల ఉత్సవ కార్యక్రమాలు జరపడం— కార్యక్రమాలను నిర్వహించుటకు నిశ్చయించుట జరిగింది. ఈ పనులు ప్రణాళికా బద్ధంగా జరుగుతున్నవి కూడాను.

గత మూడు సంవత్సరాలుగా హిందీ పరిచయ పరీక్ష నిర్వహించబడుతోంది. ఇంతవరకు సుమారు 1, 50, 000 (లక్షా ఏబది వేలు) ల మంది ఈ పరీక్షల ద్వారా హిందీ నేర్చుకొని ప్రమాణపత్రములనుపొందారు. అక్టోబర్ నెల నాటికి రెండులక్షల లక్ష్యము నెరవేరగలదని ఆశిస్తున్నాము. నాల్గు పుస్తకాలు ప్రకటితమయ్యాయి. హైదరాబాద్, విజయవాడలలో భవననిర్మాణం చురుకుగా సాగుతోంది. స్మారికను ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచార సర్వస్వంగా తీర్చిదిద్దడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ సంవత్సరం అక్టోబరులో గోష్ఠులు ప్రచారకుల సన్మానాలతో కూడిన కార్యక్రమాలు వైభవంగా జరపడానికి ఏర్పాట్లు జరుగుచున్నాయి.

ఈ సందర్భంలో ప్రచారకులు సభకు అందజేయుచున్న సహకారానికి కృతజ్ఞత తెల్పుచూ హిందీ పరిచయ పరీక్షలో ఉత్తీర్ణులయిన విద్యార్థులను అంతటితో ఆగిపోకుండా వారు తమ హిందీ భాషా జ్ఞానాన్ని సభ పరీక్షలకు చదవడం ద్వారా పెంచుకొనేటట్లు ప్రోత్సహించవలసినదిగా కోరుచున్నాము.

—o—

# కబీరు సూక్తులు

— ఈమని దయానంద

26

లేశమైన ప్రేమలిప్తముగాకున్న
వాని దేహము శవపీనుగనుము
ప్రాణహీనమయ్యు పైకొని బుసగొట్టు
కొలిమితిత్తియనుచు తెలిసికొనుము.

27

చూచి చెప్పదగిన సూక్ష్మము లన్నియు
లేఖలందు వ్రాయలేము జగతి
ఇరువురేకమైరి* చిరవధూవరు లంత
తెల్లబోయినారు* పెళ్ళివారు.

28

ఏండ్లకొలది మాలనెంత త్రిప్పినగాని
మదినిగల్గు భ్రమలు మాయలేదు
చేతనున్నమాల శీఘ్రమే విడనాడి
మదిని నామరత్న మాల త్రిప్పు.

29

వృక్షమెపుడు పండు భక్షింపబూనదు
ఏరు నీరు ద్రావనెంచదెపుడు
బ్రతుకుచుందు రిలను పరమార్థ కాంక్షులై
భక్తజనులు దేహయుక్తులగుచు.

30

పచ్చనైన మ్రాను పసిగట్టజాలును
నిర్మలమ్మటంచు నీటిప్రేమ
ఎన్నిమార్లు మేఘమేతెంచి కురిసిన
ఎండియున్న చెట్టుకేమి తెలియు ?

* జీవాత్మ పరమాత్మలే చిరవధూవరులు. పంచభూతములు పెళ్ళివారు.

# హుబ్బుల్ వతన్

కాశ్మీరీ మూలం :
అబ్దుల్ అహ్మద్ 'ఫర్హాద్'

అనుసృజనం :
డా॥ సి. నారాయణరెడ్డి

కాళరాత్రి శూన్యవక్షస్థలిపై
ప్రశస్త వీరహస్తాలు సాచి
ప్రత్యూషకిరణాంకురాల వెన్నుతట్టి
ప్రభాకరుణ్ణి నడిపించాలనుకున్నాను నేను.

చల్లారుతూనే జ్వలిస్తూవున్న జలజాసులను
ఆర్పుతూ చల్లార్పుతూ వుండే

అవి జారిపడ్డాయి ఉన్మత్తనృత్తంలో -
ప్రజ్వలించే వైభవం కళావిహీనం కాగా.

ఎంతవచోదీప్తి ఆ తరళారుణ నేత్రాల్లో
ఎవరువీరు? పసరుమొగ్గల్లాంటి పసిగుండెల్లో
విషఖడ్గాలు దించినవారు.

అదుగో ప్రతిధ్వనించింది వందేమాతరం
ఆపాతాళ గగనాంతరం.

రొమ్ములు సాచి నిలబడ్డాము
కుమ్ముకొస్తున్న తుఫానుల కెదురొడ్డాము.

ఉడికే ప్రతి రుధిరబిందువూ ఊర్మికా శిరస్సులెత్తగా
అడుగడుగునా జీవితాలర్పించాము.

సుప్రభాత సురుచిర భావుకులారా
ఇదే తుది అనుకోకండి.

గత శతాబ్దాల క్రాంతి యోధులు
గర్జించారు రక్తసిక్త గాత్రాలతో
'జన్మభూమి గరీయసీ' అని.

పవిత్ర శ్లోకము ప్రవక్త పలికిన సూక్తం
"హుబ్బుల్ వతన్ మిన్ ఉల్ ఈమాన్"
విశ్వాసానికి విశిష్టాత్మ దేశాభిమానం
పట్టుకున్న చెట్టాపట్టాలు విడిచిపెట్టకండి
కలిసి దాటాలి గభీరకాలవాహినిని.

బాస చేద్దాం రండి అక్రాంత నదీధారలా జీవించాలని
బిందువులు వేరువేరైనా ప్రవాహం ఒక్కటే -
పాదాలు వేనవేలైనా ప్రయాణం ఒక్కటే.

వైస్-ఛాన్సలర్
ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం
6-3-645, సోమాజిగూడా,
హైదరాబాదు - 500 04

# తెలుగు తెగులు

న. చ. రామానుజాచార్యులు

గాసట బీసటే చదవబడే దేశంలో
భాసుర భారతార్థాలు పఠింప బడ్డాయి.
తీరూ తెన్నూ లేకుండా వున్న తెన్గు బాసకి
గీర్వాణంతో వ్యాకరణం వెలయించ బడ్డది
అక్కడితో గుర్తించ బడింది తెన్గు జాతి ఉనికి.

అందుకే
సహస్రాబ్దికం జరప బడింది మొన్న
తెన్గు పల్కు కల్కికి.

దక్షిణగంగ నాబడు గోదావరి నది వొడ్డున
వెయ్యబడిన గట్టి పునాదుల మీదనే
నిర్మించ బడింది బృహత్తర సాహితీ సౌధం.

ఆ సాహితీ సౌధం చుట్టూ నాటబడిన
సుందర సాహితీ నందనవనం చేత
విరజిమ్మ బడ్డ తెన్గు కంపుచే
కమ్మబడ్డ దేశమ్మ దెల్ల తెల్లమ్ముగా
తెన్గునేల నా బడగ దొడగింది.

తెన్గునేల మీద తెన్గువాడి చేత
మాటాడబడని విధంగా తెన్గుబాస
రాయబడవలసి వుందని
రాయబడి వుంది తెన్గునాటి నొసట

తెన్గువాడిచేత మాట్లాడబడని తీరుగా
తెన్గు మాట్లాడించ బడటానికి
రవ్వంతైనా సిగ్గు పడ బడకుండా
నిర్వహించ బడుతున్నాయి
మన రేడియో, మన దూరదర్శనీ కూడాను

రేడియో దూరదర్శిని కొమ్మల మీద
కూర్చోబడ్డ పక్షులన్నిటి చేతా
కూయబడుతున్న కూత యిదే
తొలిసించీ తెన్గుబాస
పట్టబడి పీడింప బడుతూందీ రోగంతో.

ఇది తెలుగు తెగులు అనబడుతుంది
తెన్గు కవితకి శ్రీకారం చుట్టబడిన నాటినించి
శ్రీశ్రీ కారం పెట్టబడేవరకూ
ఈ తెలుగు తెగులు భరించ బడుతోంది.

సి-132.
HAL టౌన్‌షిప్,
హైదరాబాదు-500 042.

# కర్ణపర్వం

— వేదాటి రఘుపతి

అహంకారం అణచుకోలేక
మమకారాన్ని మంటకలిపి,
మంచిని వంచన చేసే
ఆలోచనతో, ఆవేశంతో
స్నేహం ముసుగులో
నిన్ను అభిమానిస్తూ, ఆదరిస్తూ
పట్టం కట్టిన వాణ్ని చూసి
ప్రాణమిత్రునిగా సంభావించి
దాన్ని త్యాగంగా భావిస్తున్నావా?
నీ వెలుగుల జీవితం
అధర్మానికి అంకితం కాకూడదు నేస్తం!
నడుమంత్రపు సిరికోసం
పడిచావడం పనికి రాదు!
కుతంత్రాల ఊబిలో
కూరుకొని పోవద్దు!
మురిపిస్తున్న వర్తమానాన్ని
పరిశీలించడం నేర్చుకో!
అది మరిపిస్తున్న ఆగతాన్ని
అర్థం చేసుకోవడం మరిచిపోకు!
అక్రమం ఎక్కడున్నా సరే
ప్రశ్నించడం నీ కర్తవ్యం
పరిత్యజించడం నీ ధర్మం -
సౌజన్యం శత్రువులో వున్నా
సమాదరించడం నీ మార్గం
పరిగ్రహించడం నీ స్వర్గం -
అప్పుడే ఈ నవభారతంలో
నిజంగా నీ చరిత్ర
భావికి "కర్ణపర్వం" కాక తప్పదు!

శ్రీ వేంకటేశ్వర డిగ్రీ కళాశాల
సూర్యాపేట - 508 213

# గులాబీ గుసగుసలు

— డా॥ అన్నపురెడ్డి శ్రీరామరెడ్డి

ఆశల ఆకాశంలో....
విహరించే మనోవిహంగం
సమస్యల గ్రీష్మం విసిరిన
వడగాలి దెబ్బకు
మట్టి కరిచి నప్పుడు -
స్పందించే మట్టికణాల
గుండె లోతుల్లోంచి....
కవిత్వం ఉబికివస్తుందని -
ముళ్ళ మధ్య బతికే
గులాబీ రేకుల గుసగుసలు
వింటే-తెలుసుంది!

ఆ గులాబీ రేకుల
గుణరత్నాల నమునాల నుండి
జాల్వారు కాంతి ధారల దారుల్లో
పయనించే జీవితనౌక
అంతరంగాల తరంగాలపైన
గమ్యం చేరినప్పుడు -
తీరాల పెదవుల మీద....
పచ్చని నవ్వులు ప్రతిఫలిస్తాయని
కవికోకిల లల్లిన రాగమాలికలు
రవళించెను - పరిమళించెను
మది - వీణియలై!
నవవేణువులై !!

13-10-12, ఆనంద్‌భవన్
ఫస్టు లైన్, మాచవరం
విజయవాడ-4

## శ్రీ వెంపరాల వారికి జోహార్లు

— డా॥ పి ఎస్. రామకృష్ణారావు

వెలవెల బోయింది ప్రగతి
వెంపరాల లేని ఈ జగతి
వెంపరాలా! వేయి వరాల
కవితా కుసుమాలు రాలవా యింక?
రాలినవే చాలులే?
రతనాలు వేయేల?
వేయివరాల సాటి
నీ ధీశక్తికి
ప్రద్యుమ్న వ్యాఖ్యానమే
నికషోపలము సుమీ!
మనుచరిత్రకు నీ విమర్శ
ఆంధ్ర సాహితీ మకుటంలో మణిపూస!
ఓ వ్యాకరణ వ్యాఘ్రమా!
భారత వ్యాకరణ వ్యాఖ్యాన సార్వభౌమా?
నిన్ను మృత్యువేం చేయగలదు?
సాహితీ ప్రియంభావుకుల
మనోకుహరాల్లో, పద్యకిరణాల్
జొప్పించిన సూర్యనారాయణ శాస్త్రీ
అజ్ఞాన తిమిర హర్తా!
శంకర విజయ కర్తా!
శతాయుష్మంతుడా!
తెనుగు సాహితీ స్రవంతి
వరదలై పారింది.
నీ ప్రతిపద్దె మందు
తెలుగు భాష తేనెలై
ఊరింది నీ గద్దె మందు
యశఃకాయుడవై వర్ధిల్లు
కవి చంద్రమా' పండిత ప్రకాండా!
నీకివే మా జోహార్లు

పద్మావతి పబ్లికేషన్స్
డోర్ నెం. 7-9-24
శివాలయం స్ట్రీట్, రామారావుపేట
కాకినాడ - 533 004

## సోమయాజీ - ఒక్క పేజీ

కొండపల్లి సుదర్శనరాజు

మీరు!

శాసనాల రహస్యాల్ని
చారిత్రిక నేపథ్యంతో
పుష్కర కాలం పరిశ్రమించి
తెలుగు భాషకు ఎల్లలు దాటి
ద్రావిడ భాషారూపాల తోటి
తులనాత్మక విమర్శలో మేటి
విజ్ఞానానికి మెర్క్యూరిక్ బల్బు
భాషా శాస్త్రానికి సైంటిస్టూ
అందుకోండి - సోమయాజీ
అక్షరాంజలి - ఒక్క పేజీ

మీ గ్రంథం!!
ఆంధ్రభాషకు "ఆదిగ్రంథ్"
భాషా అధ్యయనానికి భాగవతం
ద్రవిడ భాషల చుక్కాని
భాషాకుటుంబాల పారాణి
అధ్యాపకులకు బ్యారేజీ
భాషాశాస్త్రానికి కాలేజీ
అందుకోండి - సోమయాజీ
అక్షరాంజలి - ఒక్క పేజీ

ఆర్. యస్. హాస్టల్-85
ఆంధ్రాయూనివర్సిటి, వాల్తేర్-3

# స్వాతంత్ర్యపు వెలుగుల కోసం పరితపించిన తెలుగుకవులు

— కరిమద్దెల నరసింహారెడ్డి

మానవుడు సహజసిద్ధంగానే స్వేచ్ఛాప్రియం భావుకుడు. స్వేచ్ఛ మానవుని జీవం. అది ప్రతివాని జన్మహక్కు. మానవునికి సహజ సిద్ధమయిన స్వాతంత్ర్యానికి బాధ కలిగినపుడు అతని ప్రాణం విలవిలలాడి పోతుంది. స్వర్గసుఖాలను సమక్షంలో నిలిపినా వానిని సమాదరింపడు, సమీక్షించడు. మానవుడు కాదు కదా! చివరకి నోరులేని విహంగము కూడ స్వేచ్ఛగా రెక్కలల్లార్చుకుంటూ విహాయసంలో విహరించాలనుకుంటుందే కాని బంగారు పంజరాన్ని కోరదు. అందుకే కవికోకిల దువ్వూరి రామిరెడ్డి "కృషీవలుడు" అనే కావ్యంలో

"పంజరబద్ధకీరంబు బయలు గాంచి
యడ్డు కమ్ములు దాటంగ నాస చేయు
నటు బహిర్ణియమంబుల నతకరించి
మన్మనంబు స్వాతంత్ర్య సీమకు చరించు" — అని

తన స్వాతంత్ర్య పిపాసను స్పష్టము చేసినాడు. మిల్టన్ మహాకవి కూడ స్వేచ్ఛలేని స్వర్గముకంటె నరకమే మేలు" అని అభిప్రాయబడినాడు. పరవస్తు చిన్నయసూరి గారు పరావృత్తిచే వచ్చు "పాయసము కన్న స్వచ్ఛంద వృత్తిచే వచ్చు గంజిమేలు" అని స్వేచ్ఛ ప్రాధాన్యతను వ్యక్తీకరించినారు. విప్లవ మూర్తి వీరసావర్కార్ కూడా The breast of Independece is better then the cage, though made of gold" అన్నారు. సామాన్య మానవులు స్వాతంత్ర్యకాముకులయినప్పుడు మాన్యులయిన మహాకవులు స్వేచ్ఛాప్రియులనడం సత్యదూరం కాదు. "నిరంకుశాః కవయః" అను నానుడి కవుల స్వేచ్ఛా జీవితమును వ్యక్తము చేస్తూవుంది. కవులు పారతంత్ర్య శాసనాలను సయితం సహించలేరు. తన పారతంత్ర్యమును కాదుకదా తన ప్రజల పారతంత్ర్యమును సయితము కవులు చూచి సహించలేరు. అందుకే దువ్వూరి రామిరెడ్డి "కృషీవలుడు" అను కావ్యంలో కృషీవలునికి యీ విధంగా నీతి నుపదేశించు చున్నాడు.

"వాయిదా మించవచ్చిన వడ్డి యప్పు
పడతి సొమ్ములు కుదువకు పడ్డ యప్పు
వేగ తీర్చివి స్వాతంత్ర్య వీధియందు
సంచరింపుము నిశ్చింత సంతతంబు"

అప్పు నిప్పులాంటిది. అప్పు తీసికొనుట యనగా మన స్వేచ్ఛను కోల్పోవుటమే యగును. అప్పు చేసికుడుచు పప్పుకూడుకన్న కాసు ఋణములేని గంజిమేలు. అందువల్ల నీవు యితరులకు పడ్డ అప్పు త్వరగా తీర్చి స్వాతంత్ర్య వీధియందు నిశ్చింతగా సంచరింపుమన్నారు. మాతృదేశము బానిస శృంఖలా బద్ధమై మగ్గిపోవునప్పుడు స్వేచ్ఛాజీవి అయిన కవి ఒక్కొక్కసారి రేచులాగ విరుచుకు పడతాడు. ఒక్కొక్కసారి త్రాచు లాగ బుసలు కొడతాడు. పరప్రభుత్వము యొక్క దుష్టపఘట్టనలను చూచినపుడు కవుల కండ్లలో

రుధిరాశ్రుకణములు కదలాడుతాయి. మనోఫలకంలో మిన్నాగు ఫణములు మెదలాడుతాయి. భారతమాత శృంఖలా బద్ధమయిన పదాల కదలిక కవుల పెదాల మీద పలుకుతుంది. భారతమాత దీనమయిన, హీన మయిన వదనం చూచినపుడు కవి తనువులో అణు వణువులో స్వాతంత్ర్య భావం పెల్లుబుకుతుంది. స్వాతంత్ర్య భావం కవిని ఆవేశించినపుడు కవి ఒళ్ళు పరవళ్ళు తొక్కుతుంది. కవితా స్రవంతి సెలయేటి ఉరవడితో వడివడిగా దూకుతుంది. అపుడు పుట్టిన కవి కథనంలో కవి అంతర్మథనం వుంటుంది. కవిత్వం నిండుగా కవి వేదనావేదముంటుంది. దేశదాస్య విమోచనానికి వీరకిశోరం కత్తి దూస్తే కవికిశోరం కలం దూస్తాడు. ఇద్దరు తమజాతిని ఆదుకుంటారు. మమకారంతో వద్దకు చేసుకుంటారు. వీరుడు కత్తి ధరించి శత్రుకంఠవిలుంఠనం చేయ బోతాడు. కవి తన కవితా ప్రబోధం ద్వారా నిద్రా ముద్రిత మయిన జాతిలో జాగృతిని కలిగిస్తాడు. జాతి నంతటిని వీరావేశంతో ముందుకు నడిపిస్తాడు. "కత్తి బలం కన్న కలం బలం మిన్న" అని నిరూపిస్తాడు.

భారతదేశాన్ని ఆంగ్లేయులు ఆక్రమించుకున్నారు. భారతజాతి ఆంగ్లేయులను పారద్రోలడానికి నడుము కట్టింది. ఉద్యమాలు తీస్తున్నాయి. ప్రతివాడు తమ వంతు కర్తవ్యాన్ని నిర్విరామంగా నిర్వహిస్తున్నాడు. ప్రతి భారతీయుని హృదయంలో స్వాతంత్ర్య భావం లావాలాగా ఉద్గమించింది. ప్రతి యువకునిలోను స్వేచ్ఛా పిపాస వైశ్వానరంలాగా నలుదిక్కులకు నాలుకలు చాచింది. బిపిన్ చంద్రపాల్ మొదలగు దేశభక్తి ప్రపూరిత కొదమ సింగాలు పరుల పరిపాలనను సత్వరం నిర్జించాలని గర్జించాయి. కవులు పరాయి కిరాయి ప్రభుత్వాన్ని మట్టుబెట్టాలని తమ కలాలను ఎక్కుపెట్టినారు. ఉపేక్షా భావంతో ఎత్తి పెట్టిన కలాలను కూడ కవులు ఎక్కుపెట్టినారు. ఒక్కమాటలో చెప్పాలంటే కవుల పెన్నులు గన్నులయినాయి. స్వతంత్ర భారతంలో భారతీయుల జీవితాల కలలు పూచినట్లు, మలయ మారుతాలు వీచినట్లుండాలని గుర్తించిన కవులు భారతసంగ్రామ సమరంలో తమవంతు కర్తవ్యాన్ని నిర్వహించారు. స్వాతంత్ర్య సంగ్రామ సమయంలో తెలుగు కవులు నిర్వర్తించిన త్రివిధ ప్రాతఃస్మరణీయము. పరాయి ప్రభుత్వము విధించు ఆంక్షలకు జడిసిపోయి తమ స్వాతంత్ర్య కాంక్షలను వదులుకోలేదు. ఆంగ్లేయుల బెదిరింపులకు, సాధింపులకు బెదరక, లాఠీ దెబ్బలకు, కారాగార శిక్షలకు భయపడక నిష్కళంకపు దేశ భక్తితో తమ కవితా విపంచిని మ్రోగించి స్వాతంత్ర్య సమరానికి పూర్తి స్ఫూర్తి కలిగించినారు.

బిపిన్ చంద్రపాల్ ఆంధ్ర పర్యటన ప్రారంభ మయింది కలకత్తా నుండి బయలుదేరి బరంపురము విశాఖపట్టణములలో ఉపన్యసించి రాజమండ్రి చేరు కున్నారు. చంద్రపాల్ ఉపన్యాసాలను చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులు గారు అనువదించినారు. ఉపన్యాసాల చివరి రోజు చిలకమర్తి వారు ఆవేశంలో ఆశువుగా క్రింది పద్యం చెప్పారు.

'భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి'-

ఈ పద్యం సభాసదులను పురికొల్పింది. ఆంధ్రుల నాలుకల మీద నాట్యం చేసింది. ఈ పద్యం భారత స్వాతంత్ర్యోద్యమ కవితకు నాంది అయింది. ఇందులో ఆంగ్లేయులు భారతీయ జాతీయ సంపదను ఎంత నేర్పుగా దోచుకొంటున్నారో చక్కగా వివరించ బడింది. జాతీయోద్యమము వల్ల ప్రభావితులయిన తొలినాటి తెలుగు కవులలో దువ్వూరి రామిరెడ్డి గారు ఒకరు. నవ్యాంధ్ర సాహిత్య నందనోద్యానమున

కవితా రసాల శాఖ నెక్కి సింహపురి మండలంలో పారసి కన్న శ్రావ్యమయిన తెలుగులో స్వాతంత్ర్య ప్రశస్తిని చాటు పద్యాలను మధురాతి మధురంగా గానము చేసి ఆంధ్రప్రజల హృదయాల నుర్రూత లూగించినారు. మహాత్మాగాంధీ రాజకీయ రంగములో పీరంగం త్రొక్కక ముందే స్వాతంత్ర్య శంఖారవము వినిపించిన స్వాతంత్ర్యోద్యమ కవి దువ్వూరి. వర్తమాన కేంద్రం మీద కాలు మోపి అగామి యుగాల వ్యక్తిత్వమును తన కవిత్వంలో ప్రదర్శించిన దూరదర్శి కవి దువ్వూరి రామిరెడ్డి. స్వాతంత్ర్య రథమును శ్రీశ్రీ చూడకముందే మొయిల్దారిని బయల్దేరిన స్వాతంత్ర్యరథమును దువ్వూరి రామిరెడ్డి చూచినాడు. స్వాతంత్ర్య రథము ఆకాశమార్గంలో నున్నపుడే కనులారా చూచినాడు.

'అంబుదంబుల నమృత పూరంబు లొలుక
నింద్ర చాపంపు తోరణ మింపు గులుక
కారు మెరుగులు నెల్లెడ కడలు కొనగ
వెడలె స్వాతంత్ర్యరథము విస్వీథియందు'-

అన్నాడు. ఆ స్వాతంత్ర్య రథానికి గుఱ్ఱాలు లేవు ఏనుగులు లేవు. ప్రజలే అ రథానికి తురంగములు.

'లేవు దివ్య తురంగములు లేవు కరులు
ప్రజలె యా తేరు మోకులు పట్టువారు'-

అంటూ ప్రజా సందోహానికి, వారు పాలు పంచుకొనే స్వాతంత్ర్య రథోత్సవానికి నివాళులు పట్టారు.

పరాయి ప్రభుత్వ నిరంకుశ విధానాన్ని తీవ్రంగా ఖండిస్తూ, తన కలాన్ని కత్తిలా ఝళిపించిన కవితాజు భావ విప్లవకవి త్రిపురనేని రామస్వామి చౌదరి. ఉప్పు సత్యాగ్రహం ఉధృతంగా జరుగుచున్న రోజుల్లో రామస్వామి చౌదరి విరాళా లందించడమే గాక చక్కని కవితా నీరాజనాల నందించినారు. సత్యాగ్రహుల నుదుట కుంకుమ తిలకం పెట్టి, చందనం పూసి

'వీరగంధము తెచ్చినారము
వీరు దెవ్వరొ! తెలుపుడీ
పూసి పోదుము, మెడను వైతుము
పూలదండలు భక్తితో'-

అంటూ సత్యాగ్రహుల యందు పరాక్రమాన్ని పలకరించినారు. మదించిన తెల్ల దొరతనమనే మత్త మాతంగాల కుంభస్థలాలపై కుపిత సింహములై లంఘించమని తెలుగు యువకులను పురికొల్పినాడు

'పగవారు మన పయికి వచ్చి పడ్డారు
కోయంచు మన యూళ్ళు కొల్లగొట్టారు
గూటిలో పిట్టల్ని కూల్చి వైచారు
పొలములో పసి లేళ్ళ పొడిచి చంపారు

మరిచి పోవద్దోయ్ మరచిపోవద్దు
మన జాతి యగచాట్లు మరిచిపోవద్దు
నిదుర పోనీకోయ్ నీ చేతి కత్తి
త్రాగించు పగవారి రక్తంబు నెపుడు

అంటూ జాతి యవస్థను. పరాయి ప్రభుత్వ దురాగతాలను వ్యక్తము చేసినారు.

ప్రణయ కవిత్వంతో పాటు ప్రజా కవిత్వాన్ని కూడ రచించిన కవితా సవ్యసాచి బసవరాజు అప్పారావు. వీరు రచించిన 'మా గాంధీ' అను గేయం పాడని ఉద్యమ ప్రచారకుడు ఆ దినాల్లో లేడనిన అనృతము కాదు.

'కొల్లాయి గట్టితేనేమి- మా గాంధీ
కోమటై పుట్టితేనేమి- మా గాంధీ'

- అను గేయము ప్రతి దేశభక్తునికి వేదమంత్రమయింది. అయ్యంకి వెంకటకృష్ణయ్య గారు పురుషులనే గాక యువతులను సయితం స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనమని ప్రబోధించినారు. వీరి కవిత్వంలో ఉరకలు వేసే ఉత్సాహం. అంచులు దాటే ఆవేశం కనిపిస్తుంది.

'అధికారమున్న ఆంగ్ల ప్రభుత్వాన్ని
గడగడా వణికించినాడు'

అని విప్లవమూర్తి అల్లూరి సీతారామరాజును ప్రశంసించి యువకుల కుత్సాహము కలిగించినాడు.

స్వాతంత్ర్యోద్యమ కవిత్వములో గురజాడది చిఱుజాడ కాదు. గురుజాడ. అది తరువాతి వారికి వెలుగు జాడ. 'దేశమును ప్రేమించుమన్నా, మంచి యన్నది పెంచుమన్నా, దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్' అని గురజాడ చెప్పినవి మాటలు కావు, మంత్రాలు. వీరి దేశభక్తి గేయము బంకిం చంద్రుని 'వందేమాతరం, రవీంద్ర కవీంద్రుని జనగణమన, శంకరంబాడి సుందరాచార్య మా తెలుగు తల్లికి మల్లెపూదండ, ఇక్బాల్ కవి రచించిన సారే జహాసే అచ్ఛా హిందూస్తాన్ హమారా" అనుగేయాల సరణికి సంబంధించినది స్వాతంత్ర్యోద్యమ కవిత్వంలో రాయప్రోలు సుబ్బారావుగారి సరణి ప్రత్యేకమయింది. "నాలోకం బాగు పడాలి-నేను ఏదయినా ప్రయత్నం చేయాల. 'జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అను నానుడి నాలో సుళ్ళు తిరిగింది. మాతను మించిన పరమామృతము లేదను నిశ్చయంతో నా దేశ ప్రజలను మేలుకొలుపుటకు నాలోని చేతన మేల్కొంది" అంటాడు రాయప్రోలు సుబ్బారావు దేశాభిమానంతో రాయప్రోలు వారు రచించిన రెండు మూడు గేయాలే శాశ్వతంగా నిలిచిపోయాయి.

"ఏదేశమేగినా ఎందుకాలిడినా
ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనినా
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరవము"
అవమాన మేలరా అనుమాన మేలరా
భారతీయుడనంచు భక్తితో పాడ" - అంటూ

జాతి గౌరవాన్ని, అభిమానాన్ని ప్రదర్శించమంటాడు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో కవులందరు స్వాతంత్ర్యము కావాల, రావాల, అని చెప్పినవారే అయితే వారు స్వాతంత్ర్యము ఎందుకు కావాలో, ఎందుకు రావాలో స్పష్టంగా చెప్పలేదు స్వాతంత్ర్యము ఎందుకు రావలెనో దాని అవశ్యక మేమో వివరించి చెప్పినారు పైడిపాటి సుబ్బరామశాస్త్రి.

"పొట్టనిండాకూడు-కట్ట నిండా బట్ట
మే మనుభవించగా మిగిలినది యితరులకు
పెద్ద చేతితో పిలిచి పెట్టాలి
పెద్దమనసనిపించుకోవాలి"—ఇందులో భారతీయుల విశాల మనస్తత్వము చెప్పబడింది.

స్వాతంత్ర్య సమర పోరాటంలో ఎందరో మహానుభావులు అసువులర్పించినారు. జాతీయోద్యమాన్ని రూపుమాపుటకు పరాయి ప్రభుత్వము విఫల ప్రయత్నాలు చేసింది. పరాయి ప్రభుత్వ దమన నీతిని చూచి భారతీయులలో స్వాతంత్ర్య కాంక్ష మరింత రెచ్చిపోయింది. తెల్లవారికి స్వస్తి చెప్పాలని ప్రజలు తలంచినారు. అపార మయిన ప్రజానీకము యొక్క అభిప్రాయంతో ఏకీభవించిన జాతీయకవి గరిమెళ్ళ సత్యనారాయణ ఈయన రచించిన గేయాలు దేశీయుల నరనారాల్లో ప్రతిధ్వనించినాయి. నాగస్వరము మ్రోగితే మూలనున్న ముసలిపాము నటుతము పడగ విప్పి నాట్యం చేసినట్లు గరిమెళ్ళ పాడుతుంటే ప్రజానీకము పరవశించేదట. సత్యనారాయణ తన కంచు కంఠంతో "మాకొద్దీ తెల్ల దొరతనము" అనే పాటను పాడినపుడు విని 'బ్రేకన్' అను ఆంగ్లేయుడు భాష రాని నాకే గగుర్పాటు కలిగింది. ఇక దేశీయుల్లో ఎంత ఉత్తేజం కలిగిస్తుందో అర్థమైంది' అని ఆశ్చర్యంతో కూడిన భయాన్ని పొందినాడట —

"మాకొద్దీ తెల్ల దొరతనము
దేవ మాకొద్దీ తెల్ల దొరతనము
మా ప్రాణాలపై పొంచి మానాలు హరియించె"

అను గేయము స్వాతంత్ర్యోద్యమ కవిత్వంలో గరిమెళ్ళ సత్యనారాయణకు తిరుగులేని స్థానము సంపాదించింది. సమస్తాంధ్రుల నాలుకల మీద నాట్యం చేయు గీతాలు రచించిన వారిలో గరిమెళ్ళవారు ముఖ్యులు. "స్వరాజ్యం నా జన్మహక్కు" అని గర్జించిన తిలక్‌మరణానంతరం మహాత్ముడు నెక్కినాడు. స్వాతంత్ర్యోద్యమానికి "మహాత్ముడు" సారథియైనాడు. అపుడు బలిజేపల్లి లక్ష్మీకాంతకవి

"తరిగాంధీయుగ మేగుదెంచె నిక నేతద్భారతీయస్వరా
జ్య రథం బాతని సారథిత్వముననే సాగింపు
డంచున్ జగ
ద్గురు దేగెన్ దివి లోకమాన్యుడవె యుద్ఘోషించె
తూర్యధ్వనుల్

ఉరు తద్దివ్య రథంబు లాగుటకు రండో భారతీయ ప్రజల్" అని భారత ప్రజానీకమును స్వాతంత్ర్య రథమును లాగుటకు రమ్మని పిలుపు నిచ్చినారు.

భారతీయులకు స్వాతంత్ర్యఫలము లభించాలన్న మత మౌఢ్యాలను మాపి, కుల కుడ్యాలను కూలదోసి పోరాడాలని ప్రబోధించినారు ఉమర్ ఆలీషాకవి.

"ప్రకృతిలో ఎక్కడాలేని మైల-అంటూ
మనుష్యుల కెందుకు
గంధవహున కేమైనను కలదె మైల" అని

ప్రశ్నించినారు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో అటు ప్రత్యక్షంగాను, పరోక్షంగాను భారతీయులలో జాతీయ భావాన్ని కలిగించిన కవితంసులలో తుమ్మల సీతారామమూర్తిగారు ముఖ్యులు. బాలచంద్రుడు యుద్ధానికి పోవుచుండగా ఆతనిని తల్లి యుద్ధానికి వెళ్ళవద్దని వారిస్తుంది. అపుడు బాలచంద్రుడు పలికిన పలుకుల్లో ఆనాటి స్వాతంత్ర్యోద్యమకారులు కనపడతారు.

"పుత్రుడని మిత్రుడనియు కళత్రమనియు
భర్తయని సోదరుండని బాంధవుడని
బాలుడని వృద్ధని తలంచ వేళగాదు
తల్లిరో ! సాగుచుండె స్వాతంత్ర్యరణము"

భారతీయుల స్వాతంత్ర్య సమరాన్ని రూపుమాపుటకు ఎన్నో ప్రయత్నాలు చేసినారు. అయినను ఉద్యమము వెలిగించిన చిచ్చుబుడ్డిలాగా రెచ్చిపోయిందేగాని మంచులో తడిసిన దాసిలాగ చచ్చుబడి చచ్చిపోలేదు. చల్లబడిపోలేదు. ఈ విషయాన్ని సుబ్రహ్మణ్య భాగవతులు

"ఇంతిని క్రిందకొత్తినను పైకి మరింతగ లేచురీతివా
రెంతటి క్రూరపద్ధతుల నీమన యుద్యమమాప
నెంతయో
యంతకు నంతగా నతిశయంబయి వర్ధిలుచుండు
గాని యా
వంతయు తగ్గిపోవదని యాఘనులిప్పుడెరుంగ
పల్కుడీ"—చెప్పినారు.

మహాత్ముడు అహింసామార్గంలో స్వాతంత్ర్య సంపాదనకు ప్రయత్నించుచుండగా బుద్ధిరెడ్డి కోటేశ్వరరావను కవి హింసాత్మకమయిన ఉద్యమాన్ని సమర్థించినారు.

"ఏరాజ్య ప్రజలయిన హింసలుగావింపకను
స్వారాజ్యం దెచ్చినార-యిటలీ ఐర్లండు
దేశీయులైన రక్తధారలు గావించియె
స్వతంత్రీయులైనారు"— అంటారు

సుమసుకుమారాలయిన పదాలతో అందమయిన భావాలనందించే బంధ్యాల పాపయ్యశాస్త్రి గారికి సౌంధర్యశ్రీ సయితము "సంజవెలుంగులో పసిడి ఛాయల ఖద్దరు చీరకట్టి కనిపించింది. భారతీయుల స్వాతంత్ర్య పోరాట ప్రభావమును

"లేచిపోయినవి పోలీసుల టోపీలు
వందలు వేలు రాబందులట్లు
కాలిపోయినవి సర్కారు కచ్చేరీలు
ఖరదూషణాదుల కాష్ఠమట్లు
తెగిపోయినవి తంతి తీగెలు భారతీ
యుల పారతంత్ర్య శృంఖలములట్లు
తరలి పోయినవి క్రిందకు రైలుపట్టాలు
పాశ్చాత్యుల రాజ్య సౌభాగ్యమట్లు
ఒకటి యన నేమిటి మహోద్యమమున
రేగిపోయిన ప్రజల యుద్రేకమునకు
అల్లకల్లోలమై దద్దరిల్లిపోయె
తెల్ల దొరల ప్రభుత్వ మందిరములెల్ల" అని
ప్రశంసించారు.

భారతమాత దాస్య శృంఖలాలను ఛేదించుటకు పరితపించిన తెలంగాణా కవులల్లో దేవులపల్లి రామానుజరావు ముఖ్యులు.

"తెల్లవారల రాజ్యంబు తెల్లవారు
దనుక ఆకలి దప్పుల దలపలేము
ఎవ్వరేమయిన నందు నీకేమి కొరత
ముందు నిలబడి నడిపింపుమో మహాత్మా!"

అని మహాత్ముని ప్రార్థించినారు. యువకుల పౌరుషమును రెచ్చగొట్టినారు.

"చీర సింగారములు చేసి సిగ్గుపీడి
గొప్ప పదవుల యందున కుల్కికూయు
పురుష భామామణుల యింటి తరుణులందు
ఇద్ద తిక్కన్న భార్యల టొక్కరును లేరె?"-

అంటూ తెలుగు వీరుల పరాక్రమమును కదిలించినారు. మెత్తమెత్తగా హాస్యధోరణిలో చురకలు వేసినారు. ఈ చురకలు యువకులలో పరాక్రమాన్ని ఉరకలు వేయించినా యనుట అతిశయోక్తి కాదు.

1921వ సంవత్సరంలో భారతదేశాన్ని సందర్శించుటకు వేల్సు యువరాజు వచ్చినాడు బొంబాయి నగరంలో ఆందోళనలు జరిగినాయి. మహాత్మాగాంధీ శాంతియుతంగానే మన అసమ్మతిని తెలియజేయాలని చెప్పినాడు ఆ సందర్భంలో "మొక్కపాటి శ్రీరామ శాస్త్రి" అనుకవి

"పోపోపోవోయి వేల్సు యువరాజా
బానిసలుగా మమ్ము చేసీ
బాగు బాగని చెప్పగ వస్తివి
సత్యము, శాంతము సమత్వమనియెడి
గాంధి దేవుడు మాలో యుండగ
ఏ మొగ మెట్టుక ఇట కొచ్చితివి"-అని వేల్సు

యువరాజును తిరస్కరిస్తూ నిరసనను వ్యక్తం చేసినాడు.

యనమండ్ర కృష్ణారావనుకవి స్వరాజ్యమంత్రము అను పాటల పుస్తకము ప్రచురించినారు. అందులో "అక్రమము" అను పాటలో తెల్లవారి అక్రమాలు తెల్లము చేయబడినాయి.

"సీమ నుండి వచ్చినారు తెల్లవారు
వర్తకమంచు చెప్పినారు తెల్లవారు
తక్కెడ చేత బట్టినారు తెల్లవారు
తప్పుడు త్రోవ త్రొక్కినారు తెల్లవారు"-అని

చెప్పినారు. ఇందులో తెల్లవారి కపటపు మాటలు స్పష్టము చేసినారు. పెనుమర్తి కామేశ్వరరావు "జెండా" అనుగేయంలో

"ఎగురవే ఎగురవే గగనమ్ము వరకునూ
పగవారి పక్కలో బల్లెమై తనరారు
ఎగురవే ఎగురవే మా గాంధి జండా"-అని

భారత స్వాతంత్ర్య జండాను సంబోధించి ప్రబోధించినారు.

భారతీయుల స్వాతంత్ర్య సమరోత్సాహానికి అస్తమించని ఆంగ్లేయ సామ్రాజ్యం హడలిపోయింది వారి పరిపాలనా సదనాల కుడ్యాలు సడలి పోయినాయి. వారి కాళ్ళ క్రింది నేల క్రుంగి పోయినట్లయింది. ఎంతో మంది దేశభక్తులు, కవులు ఆంగ్లేయుల లాఠీదెబ్బలు తిన్నారు. చెరసాలల కేగినారు వారి తుపాకి గుండుకు గుండె చూపించినారు. ఎందరో వారి అసువు లర్పించినారు భారతీయుల స్వాతంత్ర్యకాంక్ష సూర్యుడస్తమించని బ్రిటిష్ ప్రభుత్వాన్ని హడలు గొట్టింది. ఆఖరికి అవతలికి నెట్టింది. ఎంత మంది దేశభక్తులు తను, ధన, మాన, ప్రాణాలను త్యాగం చేస్తేనో మనకు స్వాతంత్ర్యము దక్కింది. దేశం కోసం పోరాడి అసువులర్పించిన వీరులకు పురిపండా అప్పలస్వామి నివాళులర్పించినారు.

> "చిరపరాధీన శృంఖలా చ్ఛేదమునకు
> జీవిత సుమాలె ధార వోసితిరి మీరు
> కురియదే నేడు స్వర్గీయ కుసుమ వృష్టి
> శ్రీ విరాజిల్లు మీ యొద్ద శిరములందు"

లెక్చరర్
20/441, మూలాపేట, నెల్లూరు-3

# అంతస్థులు

— కె. సుబ్రహ్మణ్యం

ఓ ఉచ్చస్థాయి 'అహం'
ఓ మధ్యస్థాయి నేస్తం'
తటస్థంగా చుట్టరికం
కలుపుకుని పలుకరించుకున్నాయి.
పరామర్శల్లో 'అహం' భావం
అరమరికలు ఉట్టిపడేలా
అరుదైన డ్రాయింగ్‌రూం సెట్టింగులు—
టీ. (కే.)వీ., వీడియో, స్టీరియో సెక్కులు—.
కార్పెట్స్, వాల్ పేపర్స్ కావరాలు-
పాలమీగడఛాయ ప్రియదర్శిని ఫోను-
డైనింగ్ టేబిల్, క్రాకరీ, కట్‌లెరీ, ఫ్రిజ్,
బెడ్రూమ్స్ ఫోటోజెక్స్ పోకడలు,
'నేస్తం'కు నయనానందంగా విందుచేసింది.
పోర్టికోలో నుంచి టొయోటా తీసి
నేస్తానికి లిఫ్ట్ ఇస్తూ అడిగింది 'అహం'—
"తెలీక అడుగుతున్నా-మీకు
కారు, టెలిఫోను అంటూ వుందా ?—
అదేమిటి?-లేకుంటే పోనిద్దురూ!
టూ-ఇన్-వన్, ఫ్రిడ్జిలాంటివి......
భలే ! వద్దని వూరుకుంటే సరా ?!
ప్రిస్టేజి కుక్కరన్నా...లేదంటారా ?
యమజోకే వేశారండోయ్ !!"
అంతస్థుల అంతరాల పాఠం
'అహం' దగ్గిరే నేర్చుకుంది 'నేస్తం'.

డిప్యూటీ మేనేజర్స్ (ఫైనాన్స్)
భారత్ ఎలక్ట్రానిక్స్ లిమిటెడ్
29/4, రేస్ కోర్స్ రోడ్,
బెంగుళూరు-560 001.

# బసవరాజు అప్పారావు గారి కవితా రామణీయకత

— వై. నాగయ్య

ఆధునిక కాలంలో నేర్పడిన తొలి సాహిత్యోద్యమము భావకవిత్వము. కవిత్వములో నుండు వస్తు-భావ-రచనలలో భావమునకు ప్రాధాన్యమిచ్చినది భావ కవిత్వము భావకవిత్వమును "కావ్యములు రసప్రధానములు ఖండకావ్యములు భావప్రధానములు. కావ్యము లందు ప్రతిపద్యమునందు భావముండవచ్చును. కాని కావ్యము సమిష్టిమీద రసాభిముఖముగాపోవును. ఖండ కావ్యములందును భావములు రసవ్యంజకములు కావచ్చును. కాని ఖండకావ్యముల ప్రధానముగా ఒక భావమును ఆశ్రయించియే యుండును. అందుచేత దీనిని భావకవిత్వము అనవచ్చును." అని విశ్వనాథ సత్యనారాయణగారు నిర్వచించిరి. ఇది పాశ్చాత్య సాహిత్య ప్రభావము వలన నేర్పడినను దాదాపుమూడు దశాబ్దాల పాటు ఆంధ్ర సాహిత్య కేదారమున పసిడి పంట పండించినది.

ఈ భావ కవిత్వోద్యమ కాలంలోనే తనదైన ఒక ప్రత్యేక శైలిని ఏర్పరచుకొని మంజుల మనోజ్ఞము లైన భావగీతాలను స్వేచ్ఛగా పాడినవారు శ్రీ బసవ రాజు అప్పారావు. వీరి భావనాశక్తి ఎంతో ఉన్నత మైనది, జనపదుల బాణిలో చక్కని భావాల నల్లిన వీరికి ప్రకృతియందెంతో మక్కువ. చక్కని ఆధ్యాత్మిక దృక్పథము కలవాడు. ఈ లక్షణాలన్నియు ఆత్మాశ్రయరీతిలో పాడుకొన్న 'బసవరాజు అప్పారావు గీతాలు" అను వీరి రచనలో మనకు కనిపిస్తాయి. వీరి కవిత్వాన్ని గూర్చి "నగ్నంగా నిజంగా ఉంటుంది. ఈయన కవిత్వం జలుకూ తలుకూ ఉండదు, ఉండటానికి వీలులేదు. ప్రతిభావము గుండె చీల్చుకొని సూటుగా వస్తుంది" అని ముద్దుకృష్ణ గారు పేర్కొనిరి.

భావ కవులందరిలోను ప్రధానంగా కనబడే ప్రణయాన్ని బసవరాజుగారు మృదుమధుర పదాలతో సరళ సుందరముగా వర్ణించాడు. ప్రేమతత్వముఅను గేయములో యిలా అంటాడు.

వలపెరుగక బ్రతికి
కులికి మురిసే కన్న
వలచి విఫలం మ్మొంది
విలపింప మేలురా

ప్రేమించు సుఖముకై
ప్రేమించు ముక్తికై
ప్రేమించు ప్రేమకై
ఏ మింక వలయురా.

చెలివలపు లేకుండా ఎంత కలిమియున్నా కల్లనే కాని నిజం కాదు మానవుడు యిహంలో కోరేది సుఖం పరంలో కోరేది ముక్తి. ఈ రెండు కూడ ప్రేమించుట వలన మాత్రమే కలుగుతవి. చివరికి నీవు యితరులచేత ప్రేమించబడాలన్నా నీవు ప్రేమించటము అవసరము. లోకమే ప్రేమమయం ప్రేమ లేని జీవితమేలేదు. ఇది వీరి ప్రేమసిద్ధాంతము. చివరలో ప్రేమించు, ప్రేమించు అని మూడుమార్లు

వాడుటవలన చెవులలో ఆ శబ్దము మారు(మోగుచు అప్పారావు గారి (పేమ మన మనస్సులను దోచు కుంటుంది. చివరి నాలుగు పాదాలు చాల పేరిని భావ కవిత్వంలో ఉన్నత స్థానం మీద కూర్చుండబెట్టుటకు. ఎంతో గొప్పభావనను చిన్న చిన్న వాక్యాలలో చక్కగా వర్ణించాడు. అల్పాక్షరములలో ననల్పార్థ రచన చేయుటయన్న నిదియేగదా !

(పేమయే జీవితం కాబట్టి (పేమించాడు. తన (పేయసికి తనకుగల అన్యోన్యతను అతి సుకుమా రంగా వర్ణించుకున్నాడు. ఈ (పేయసితో సంయోగ మును వాంఛించి యిలా అంటాడు.

ఆ మబ్బు ఈమబ్బు
ఆకాశ మధ్యాన
అద్దుకున్నట్లు మన
మైక్యమౌదామె ?

ఇక్కడ వాడిన ఐక్యమౌదామన్న పదానికి ఎంతో గొప్పఅర్థమున్నది. వాడుకలో లింగైక్యమగుటఅన్నది (పచారములో నున్నదిగదా! (ప్రకృతిలోని మబ్బు తీగలు స్వేచ్ఛగా పెరిగి తిరుగుతూ కలసి పోతాయి. వీటికి ఎవరి అదుపు ఉండదు. వీటినే ఉపమానము లుగా స్వీకరించుటవలన కవి తన (పేమ కూడ అలానే ఉండాలని వాంఛించుచున్నాడని తెలియు చున్నది. (ప్రకృతి (పణయములు సహజ (ప్రవృత్తులే కాబట్టి, పోలిక సమంజసముగా నుండి కవిభావనాచాతు ర్యమును తెలుపుచున్నదీ గేయము. words worth "Poetry is the spontaneous overflow of powerful feelings" అని అన్నమాటలు యిక్కడ చక్కగా వర్తించును ఇలా సంయోగమును వాంఛించిన కవికి వియోగము కలుగగా—

కలలోనైనను కనుపడి
చెలియ ఈ దీనునిమది
యలజడి యంతయు బోపన్
కలసి వలపు దీర్పలేవె ?

అని (పాధేయ పడుతాడు. అయినా ఫలితము కని పించలేదు. తన మనస్సంతా నిండియున్నదితన (పేయ సియే కాబట్టి చివరికి తన నిర్ణయాన్ని ఈ విధంగా (పకటిస్తాడు.

పోసిలే అంతదయ నీకు బుట్టకున్న
కర్మమనియెంచి గడిపెద కాలమెట్లో
ఎంచియో ఎంచకో (పేమనించినాను
(బతికినను చచ్చినను-నాదు(పాణమీవె.

ఆచార్య రాయ(ప్రోలు సుబ్బారావుగారు (ప్రకృతి లోని తృణకంకణముతో పరమోదాత్తమైన అమలిన శృంగార తత్వాన్ని (పచారముచేస్తే, మధురకవి కృష్ణ శాస్త్రిగారు 'ఆకులో ఆకునై. పువ్వులో పువ్వునై' అడవిలో దాగిపోతానిని పాడుకుంటే బసవరాజుగారు (ప్రకృతిలోని దృశ్యాలలో కూడ తన (పణయ భావ ననే చూసుకున్నాడు 'కోకిల' అను గేయంలో యిలా అంటాడు.

ఈ మావిపై నుండి
ఈవు కూకూ యంచు
నా మావిపై నుండి
ఆపె కూకూ యంచు

మనుజుల కగమ్యమై
మహిత శక్తిం గలిగి
పరమామృతముఁ బొల్కు
(పణయ వాక్కుల మీరు
బాసలాడుచు నుంటిరే కోకిలా
బాసలాడుచు నుంటిరే?

కోకిలలు మాట్లాడుకొను మాటలు వట్టివికావు (పణయవాక్కులు. ఆ పలుకులు (ప్రకృతి సహజ ములై అమృతములంత మధురమైనవి అవి మాట లాడుకొను మాటలు బాసలలాగున్నవట. మనుజుల కగమ్యమైన పమట వలన అవి (పణయ జీవులకు మాత్రమే అర్థమగునని, సామాన్యులనికి అర్థం కావని

తెలియుచున్నది కోకిలలను ప్రణయ కవులని, ప్రేమ స్వరూపులని అనుట నూతన భావన ఇందలి క్రియా వాక్యములను రెండు మార్లు చెప్పుటవలన కవికి తా చెప్పు విషయముపై గల మక్కువ ద్యోతక మగుచున్నది.

"ఆధునిక కాలంలో వచ్చిన సాహిత్యాలను పరిశీలించినచో నాటి భావ కవిత్వము నుండి నేటి విప్లవ సాహిత్యము వ్రాసిన కవుల వరకు దాదాపుగా అందరి రచనలపై ప్రాచీన జానపదులు పాడుకొన్న పాటల శైలి, భాష, భావముల ప్రభావము అంతోయింతో కనబడుచున్నది. నేటి సాహిత్యంలో కనబడుతున్న ప్రతీకాత్మకత, ఆత్మాశ్రయత్వము. అస్తిత్వము మున్నగునవి ఆధునిక కాలంలో పాశ్చాత్యుల యందు ఒక ఉద్యమంగా ఏర్పడినంత మాత్రాన వీటి ప్రభావము చేతనే మన కవులు రచనలు చేయుచున్నారనుటకంటే వీరి రచనల్ను పరిశీలించాలనుకున్నపుడు జానపద సాహిత్యంలో గల వివిధ దృక్పథాలను అధ్యయనము చేయటము ఎంతయినా అవసరము"2 అన్న నాయని కృష్ణకుమారి గారి మాటలు ఎంతయినా గమనించ దగినవి. బసవరాజుగారి రచనలలో కూడ జానపదుల ప్రభావము ఎంతో కనబడుతుంది. వీరి "వెర్రిపిల్ల" యిలా పాడుతుంది.

గుత్తొంకాయ కూరోయ్ బావా
కోరివండినానోయ్ బావా
కూరలోపల నా వలపంతా
కూరి పెట్టినానోయ్‌బావా!
కోరిక తీర తినవోయ్ బావా!

'వలపనే కూర' 'ప్రేమని యేటిపాలు' 'కన్నెవలపనే వెన్న' పువ్వులలో పొదిగిన యవ్వనం' అను సమాసాలు ఈ గీతానికి ఎంతో నిండుదనాన్ని చేకూర్చినవి. నల్లవాడే/గొల్ల/పిల్లవాడే అను గేయంలోని శబ్దాలంకారము చక్కని లయను కలిగించి విను వారి డెందమును రంజింప జేయుచున్నది. ఈ రెండును కొద్దిమార్పుతో "గుత్తివంకాయ కూరా/కోరి వండాను రారా/నారరే యంత వుండిపోరా," "నల్లవాడే అమ్మమ్మో అల్లరి పిల్లవాడే" అనునట్లుగా నేడు సినీజగత్తులో బహుళ ప్రచారము పొందినవి.

అప్పారావుగారు చక్కని భావకుడే కాక గొప్ప తాత్వికుడు, ఆధ్యాత్మికుడు. భావన ఊహాజనితమైతే, తాత్వికము హేతు జనితము. ఈ రెండు లక్షణములు వీరొక్కరే కల్గియుండుట వీరి విశిష్టతను తెలుపుచున్నది. భగవంతున్ని యిలా దీనంగా వేడుకుంటాడు

"అకటా' నా జీవనదంబిది యేమి

* * *

ఇంతేనా? ఇంతేనా? సౌఖ్యం
బీజన్మకు విక నింతేనా
సుంతమైన దయలేదా దేవా?"

'అకటా! అనునది సంతాపార్థకము. అకటా! ఇంతేనా? అనువానిని ముమ్మార్లు వాడుట వలన మన హృదయములు ద్రవించి కవిపై జాలి కల్గుచున్నది. కవితా మర్మము తెలిసినవారు మాత్రమే యిలా సందర్భోచిత పదాలను ప్రయోగించ గలరు. కొండలతో కోనలలోఅగాధంగా ప్రవహించునదులతో జీవనమును పోల్చుటచే జీవితం సుఖదుఃఖాల మయం, అవి వాని వాని కర్మను బట్టి లభించును. పరమాత్ముని అనుగ్రహం కలిగినపుడు జీవనదము యొక్క ప్రవాహం ఆగిపోతుందని ఆ భగవంతున్ని నమ్మకోవటమే మన పనియని ఆధ్మాత్మిక భావనను కలిగింప చేయుచున్నాడు. "సాహిత్య విమర్శకు ఔపనిషద తాత్విక దృక్పథములను సాధనములుగా ప్రదర్శించుట అప్పారావు వెలయించిన విమర్శలోని ప్రత్యేకత"3 అని కోవెల సంపత్కుమారాచార్యగారు అన్న మాటలను బట్టి వీరు కవితారచనలలోనే కాక సాహిత్య విమర్శలో కూడ చక్కని అధ్యాత్మిక తాత్విక దృక్పథములను కలిగి వున్నారని తెలియుచున్నది.

'నిర్వాణసుఖం' 'జీర్ణం జీర్ణం' అను ఖండికలలో తన సంతానము పోయినపుడు వ్రాసిన స్మృతులు, 'గోపికా' 'రాధికా' గీతలలో వీరు వర్ణించిన భక్తి చక్కని సాహిత్యం.

భావనా గీతాలతో పాటు ఆ నాడు సాగుచున్న జాతీయోద్యమమును గురించి అందులో మహాత్ముని గురించి వారి సిద్ధాంతాలను గురించి వీరు వ్రాసిన కళాత్మకమైన గీతాలు ప్రజలను ఎంతో ఉత్తేజ పరిచినవి. గాంధీజీ ప్రారంభించినఉప్పు సత్యాగ్రహమును దృష్టిలో పెట్టుకొని 'స్వరాజ్యలక్ష్మి పెండ్లికి సంద్రమే పెండ్లి యిల్లని దేవతలే సదస్యులని ఉప్పే తలంబ్రాలని అద్భుతంగా ఊహ చేశాడు. కొల్లాయి గట్టితేనేమి/ మాగాంధీ/కోమటై పుట్టితేనేమి." అను వీరి గీతం బహుళ ప్రచారం పొందింది. ఈ గీతంలో మొదటి రెండు పంక్తులు గాంధీజీ లక్షణాన్ని ప్రదర్శిస్తూ చివరి రెండు పాదాలలోను ఆ లక్షణాన్ని మహత్తరమైన ఆధ్యాత్మిక భావానికి జోడించడం జరిగింది. "భావ కవులు రచించిన జాతీయ గీతములలో కళామూల్యము కొరవడకుండా గాంధీజీని కీర్తించిన వారిలో బసవరాజు అప్పారావు గారు ముఖ్యులు."4 అని నారాయణరెడ్డి గారు వీరి గాంధీజీ సాహిత్యమును ప్రశంసించిరి.

చంద్రుని చల్లని చూపుల జల్లి, కోకిలను ప్రణయ కవి నున్నగు నూతన ప్రయోగములు వీరు గేయములలో ఎన్నో చేసినారు.

ఈ విధముగా ప్రణయాన్ని మొదలుకొని ప్రతి దానిని హృదయంతో అనుభవించి, అనుభవించిన దానిని భావించి, భావించిన దానిని సుందర సుకుమార పదాలతో తన గేయాలలో మనకందించి భావ కవి తోద్యమ కాలంలోని సాహిత్యంలో అజరామరులైనాడు. తెలుగు సాహిత్యంలోనే ఎన్నదగిన గీతాలు వీరి "బసవరాజు" అప్పారావు గీతాలు"

అథసూచికలు

1 పీఠిక - వైతాళికులు
2. ఆధునిక సాహిత్య విమర్శ రీతులు- జానపద సాహిత్య ప్రతీకాత్మకత-భారతి జనవరి 86
3. ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ- సాంప్రదాయిక రీతి
4. ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు- ప్రయోగములు

పరిశోధనా విద్యార్థి
కాకతీయ విశ్వవిద్యాలయం
వరంగల్-506 009

# మీనమేషాలు

పాలకోడేటి జగన్నాథరావు

ఘనుడా భూసురుడేగెనో నడుమ
    మార్గశ్రాంతుడై చిక్కెనో
వినికృష్ణుండిది తప్పుగా
    దలచెనో విచ్చేసెనో ఈశ్వరుం
డనుకూలింప దలంచునో తలప
    డో యార్యామహాదేవియున్
నను రక్షింప నెఱుంగునో యెఱుగరో
    నా భాగ్యమేలాటిదో

మెల్లెక్కుతున్న రఘురామయ్యకు శ్రావ్యమైన ఆ కంఠం వినడం క్రొత్తేమీ కాకపోయినా ఆ రోజు రుక్మిణీకళ్యాణ ఘట్టంలోని పద్యాన్ని వినడం మాత్రం మొదటిసారే

ఆటంకాలేర్పడి పెండ్లి కావడం ఆలస్యమౌతున్నప్పుడు సాధారణంగా పెద్దలు కన్నెపిల్లలచేత రుక్మిణీ కల్యాణాన్ని నలభై రోజులపాటు దీక్షగా చదివిస్తారు. అలా చదివిన కన్నెపిల్లలకు త్వరలో తప్పకుండా పెండ్లి అవుతుందని నమ్మిక.

పాపం. ఆ నమ్మకంతోనే కాబోలు కుటుంబరావు గారు కూతురి చేత రుక్మిణీ కల్యాణాన్ని చదివిస్తున్నట్టున్నాడు అని అనుకొన్న రఘురామయ్య ముఖమంతా కృష్ణప్రసాదు తలంపునకు రాగానే ఏదో విషాదమావరించింది.

కృష్ణప్రసాదు అంటె ఎవరో కాదు. రఘురామయ్యకు సాక్షాత్తు మేనల్లుడే. ఇంటర్ వరకూ తన దగ్గరే ఉండి చదివాడు కూడ. ఇప్పుడు ఎం టెక్ ప్యాసయి భాగ్యనగరంలో ఉద్యోగం చేస్తున్నాడు

తనకు కూతురు లేదుగాని ప్రసాదును తనకు అల్లుడిగా చేసికోకుండ విడిచిపెట్టేవాడు కాదు. అయినా ఆ ధ్యాస రఘురామయ్య విడుచుకోలేదు. శిష్యురాలే అయినా కూతురి కంటె మిన్నగా తానభిమానించే నవనీతను మేనల్లుడికి సజస్టు చేసాడు

నవనీత లావణ్యంలోనే కాదు గుణంలో కూడ నవనీతమే. ఇక చదువుల్లో అందామా అపర సరస్వతియే. ఎం.ఎస్.సి. ప్యాసయింది ఆమెకు అవసరం లేక గాని ఉద్యోగం చేసేదే.

నవనీత తండ్రి ఆ వూళ్ళో పెద్ద పేరు మోసిన లాయరు. అదృష్టవశాత్తు రఘురామయ్యకు ట్రాన్సఫరు జరుగకపోవడం వల్ల పది సంవత్సరాల నుండి ఆ వూళ్ళోనే ఉంటున్నాడు. రఘురామయ్య లెక్చరర్ల సంఘానికి కార్యదర్శి పదవి వెలగబెడుతూ ఉండటం వల్ల తప్పుడప్పుడు నవనీత తండ్రి కుటుంబరావు గారిని కలిసికొనే అవసరం వస్తూ ఉండేది. ఆ రూపంగా పరిచయం స్నేహంగా మారిపోయింది.

నవనీత ఎం.ఎస్ సి. ప్యాసయినప్పటి నుండి కుటుంబరావు గారు సంబంధాలు చూస్తూనే ఉన్నాడు. ఆ విషయం రఘురామయ్యకు తెలిసినా- వారి మధ్య ఎంతో స్నేహమున్నా తన మేనల్లుని సంబంధం చెప్పడానికి రఘురామయ్య మొదట్లో భయపడ్డాడు.

కారణం, తన మేనల్లుడికి జాతకాల పిచ్చి మోతాదును మించి ఉండటమే. రఘురామయ్య బావ గారికి జాతకాల పిచ్చి లేకపోలేదు. కాని తనమేనల్లుడు ఈ విషయంలో తండ్రి కంటె ఏడాకు లెక్కువే చది

ఆ మాటలు రఘురామయ్య మనస్సుకు చురుక్కు మనిపించాయి. అయినా ఆయన మాటలు అక్షరాలా నిజమనిపించాయి. ఏమీ దాచలేకపోయాడు రఘురామయ్య.

అదేనండి విచిత్రం. గ్రహాంతరాలకు పోగలిగే సైన్సు పురోగమిస్తున్న యీ రోజుల్లో కూడ యువకుల్లో కొందరికి పాతకాలపు మూఢనమ్మకాలు గూడు కట్టుకొని ఉంటున్నాయి. అలాంటి వాళ్ళలో మావాడు కూడ ఒకడు. వచ్చిన సంబంధాలన్నీ యిలాగే చెడ గొట్టుకొన్నాడు ముదిరిపోయిన ముప్పది ఏండ్ల పెండ్లికొడుకయ్యాడు. అంటు నిజం కక్కేసాడు.

అయినా భారతమ్మకు ఆశ చావలేదు.

"అన్నయ్యగారూ, అలా అనకండి. చెప్పేవిధంగా నచ్చచెప్పాలేగాని వినకపోవడానికి ఆతగాడేమయినా చదువులేనిమొద్దా? వినడు వినడు అంటూ వదిలించుకోక పోవడంవల్లనే యీ కాలం పిల్లలు ఇలా తయారవుతున్నారు. కొంచెం శ్రద్ధతీసికొని మరోసారి ప్రసాదుకు చెప్పిచూడండి. మామాట కాదనకండి" అంది భారతమ్మ చాల ప్రాధేయపూర్వకంగా.

ఆ మాటల్లో రఘురామయ్యకు ఎంతో నిజమున్నదని పించింది. "చెప్పేవిధంగా నచ్చచెప్పాలేగాని" అన్న మాట రఘురామయ్యలో ఎన్నో భావతరంగాలను రేపింది. యథాశక్తిగా ప్రయత్నించి ఎందుకు చూడ రాదు అని ఎవరో మనస్సును హెచ్చరిస్తున్నట్లని పించింది.

"సరే మీరు చెప్పినట్లె నచ్చచెప్పిచూస్తాను. ఆ తరువాత మీ అమ్మాయి అదృష్టం" ఆ మాటలు అప్రయత్నంగానే అనేసాడు. కొద్దిక్షణాలేవో ఆలోచనలో పడి వెంటనే లేచాడు.

భారతమ్మ సాగనంపుతు గేటుదాకా వచ్చింది. కుటుంబరావుగారు వీధివరండాదాకా సాగనంపుతు అమ్మాయికి నచ్చచెప్పమని మరోసారి హెచ్చరించి ఇంటికి వచ్చాడు.

రఘురామయ్య గారి కృషి ఫలించింది. కృష్ణ ప్రసాద్ అమ్మాయిని అయిష్టంగానే అంటె నేను చేసికోనిదానికి వాళ్లకా శ్రమ ఎందుకు? అమ్మాయి మనస్సును పాడుచేయుట యెందుకు అంటు ఏవేవో గును స్తూనే చూడ్డానికి వచ్చాడు. వచ్చేటప్పుడు కూడ మీన మేషాలెన్నో చూచుకొనే వచ్చాడు. ఈ మాత్రానికైనా ఒప్పుకొన్నందుకు సంతోషిస్తూ తల్లి, దండ్రి కూడా వచ్చారు.

సరిగ్గా ఐదున్నర గంటలకు కుటుంబరావుగారే స్వయంగా రఘురామయ్య గారి యింటికి వచ్చి అందరిని యింటికి తీసికొని వెళ్ళారు. పెళ్ళిచూపులకే కుటుంబరావు గారు పెళ్ళంత అట్టహాసం చేసాడు. బంధువుల్ని- తెలిసినవాళ్ళను చాలా మందిని పిలిచాడు.

పెళ్ళివారు రాగానే ఇంట్లోవాళ్ళ కోలాహలం సద్దుమణిగింది. రాగానే అందరికి డ్రింకులు ఎరో పది నిముషాలకు అల్పాహారాలు చక చకా సప్లై అయిపోయాయి. మధ్య మధ్యలో కుటుంబ సభ్యుల పరిచయాలూ కరచాలనాలూ ప్రత్యేకవాదాలు ముసి ముసి నవ్వుల మధ్యలో జరిగిపోయాయి. మరో పది నిముషాల్లో వేడి వేడి పానీయాలు కూడ అందించబడ్డాయి. పెండ్లికొడుక్కి మినహా. పెండ్లికొడుకు తల్లి దాన్ని గమనించి "ఈ కాస్తకే పెండ్లికొడుకుని మరచిపోయారు. పెండ్లిలో అయితే అందరిని మరచి పోతారేమో" అంటూ కప్పు టిపాయ్‌మీద పెట్టింది.

కోప్పడకండి అత్తయ్య గారూ, మాచెల్లాయే తెచ్చి యిస్తుంది. అదిగో తెచ్చేసింది అంటు వస్తున్న నవనీతవైపు చూచాడు.

మెరసిపోతున్న లేత గులాబిరంగు చీర మీద వైలెట్ రంగు పువ్వులు ప్రింటుచేసిన గార్డెన్ సిల్కు

చీరలో మరింత మెరిసి పోతు నవనీత ప్రవేశించింది. అన్నయ్య పరిచయ వాక్యాలతో పెండ్లికొడుక్కి బాదం పాలు కప్పును వయ్యారంగా అందించి కుర్చీలో సుకుమారంగా కూర్చుంది.

లక్ష్మీదేవిలా నిండుగా కూర్చున్న నవనీతను చూడగానే అందరి కళ్ళు జిగేలుమన్నాయి. పున్నమి చందమామను చూచే కలువల్లా అందరి కలువ కన్నులు నవనీతవైపే ఆకర్షింపబడ్డాయి.

పది నిముషాలు మంద్ర గంభీర నిశ్శబ్దమావరించింది. నిశ్శబ్ద నీరవ వాతావరణాన్ని ఛేదిస్తు పుట్టిన ఓంకార శబ్దంలా "అమ్మాయిని ఏదైనా అడగండి" అన్నారు కుటుంబరావు గారు.

అంతా మీరు- మీరు- అంటూ చివరకు అంతా పెండ్లికొడుకువైపు చూచారు. "అడగవయ్యా ఫరవా లేదు" అనే కుటుంబరావు హెచ్చరికతో కృష్ణ ప్రసాదు ఇంగ్లీషులో నవనీతను కొన్ని ప్రశ్నలడిగాడు.

ఎంత చదువుకొన్నా నవనీత ఆ సమయంలో సిగ్గు పడుతూనే తిరిగి ఇంగ్లీషులోనే సమాధానాలు చెప్పింది. కాని కొడుకు ప్రశ్నలు చాలవనుకొంది కాబోలు ప్రసాదుతల్లి, గృహకృత్య సంబంధమైన ప్రశ్నలెన్నో వేసింది. అన్నింటికీ ఓపిగ్గా సమాధానాలు చెప్పింది నవనీత. చివరకు ప్రసాదు తల్లి మంగళహారతి పాట ఏమైనా వచ్చునా? అని ప్రశ్నల అధ్యాయాన్ని ముగించింది.

"ఊహుం" అంటు బుర్రూపింది నవనీత.

మరయితే ఎలాగమ్మా పూజాపురస్కారాలింట్లో చేసుకోవాలికదా. దేవుని దగ్గర పాడుకోవడానికి పాటో పద్యమో రాకపోతేఎలాగ? అంటు సాగతీసింది ప్రసాదుతల్లి.

"అలా అనకండి అత్తయ్యగారూ. పాటలురాకపోయినా పద్యాలు శ్లోకాలు మా చెల్లాయికి చాలావచ్చునండి. బి.యస్ సి వరకు సంస్కృతమే చదివింది" సమర్థించాడు నవనీత అన్నయ్య

పోనీ అదే పాడమనండి. అంటు కుర్చీలో తిరిగా వెనక్కి జార్లబడి కూర్చుంది, పెండ్లికొడుకుతల్లి.

కళ్ళముందు జరుగుతున్న వ్యవహారమంతా చూస్తూ కూడ ఏమీ మాటలాడకుండ సుభద్ర పెళ్ళిజరిపించిన జగన్నాటక సూత్రధారి శ్రీకృష్ణునిలా కూర్చుని చూస్తున్నాడు రఘురామయ్య.

పాడమ్మా నవనీతా నీకు వచ్చిన పద్యమో శ్లోకమో అంటు అన్నయ్య హెచ్చరించగానే ఒక శ్లోకాన్ని ఎత్తుకొంది శ్రావ్యంగా.

సంతప్తాదశమధ్వజాడిగతినా సమ్మూర్ఛితానిర్జలా
తుర్యాద్వాదశవద్ద్వితీయమతిమన్' ఏకాదశాథ స్నపీ
సా షష్ఠీ శరమధ్యమా చ నవమ్యభ్రూ సప్తమీవర్జితా
ప్రాపోష్ణిత్యష్టమ వేదనాం త్వపధునా తూష్ణీం
తృతీ మోక్షద.

ఆపాత మధురమైన ఆ గానామృతాన్ని ఆస్వాదించి అంతా మంత్రముగ్ధులయ్యారు.

అమ్మాయీ! ఈ శ్లోకాని కర్థం చెప్పగలవా? సానునయంగా అన్నాడు పెండ్లికొడుకు తండ్రి.

'అర్థం తెలియదండి. శ్లోకం చిన్నప్పుడెప్పుడో నేర్చుకున్నాను'అంటునవనీత తలవంచుకొనే చెప్పింది.

శ్లోకం బాగుంది. దేవుని ప్రార్థన పద్యమేమిరా రఘూ అంటూ ప్రసాదు తండ్రి బావమరిది వైపు తిరిగాడు.

'ఔనౌను' ముసిముసి నవ్వులు నవ్వుతు అన్నాడు రఘురామయ్య. సరేగాని, శ్లోకంలో ఎక్కడా దేవుని పేరు కనబడదు. ఇంతకు అది ఏ దేవుని ప్రార్థన అంటావు! అమాయకంగా అడిగాడు బావమరిదిని.

'ఔను, దేవుని పేరు లేకపోయినా ఒకభక్తురాలు దీనురాలై తన పతిదేవుణ్ణి ప్రార్థించే ప్రార్థనా శ్లోకమిది' సాభిప్రాయంగా అన్నాడు పతిదేవుడని మాటలను నొక్కి పలుకుతూ.

పతిదేవుణ్ణా? ఆదేమిటి? అయితే ప్రార్థనా శ్లోక మెలా అవుతుంది? ఒక్కొక్కరుగా అడిగారు ప్రసాదు

"అవుతుంది బాపగారూ. అదంతా చెపితే చాల బాధపడరు గదా మరి." రఘురామయ్య మాటలను విని అంతా అర్థం చెప్పండి చెప్పండి అంటూ కోలాహలం చేయసాగారు.

సరే చెప్తాగాని బాపగారూ, బాధపడరు కదా? అంటూనే బాపగారి వైపు కాకుండ మేనల్లుడి వంక చూచాడు రఘురామయ్య.

నాకెందుకురా బాధ మామయ్యా చెప్పరా' అంటు వీపుమీద ఒక్క చరుపు చరవడంతో రఘురామయ్య ఇలా ప్రారంభించాడు.

ఒక నవోఢయైన నూతన వధువు తన పతి దేవునికి విన్నవించే కరుణామయ గాధే యీ శ్లోకం.

ఆమెకు పెండ్లయి మూడేండ్లయింది. కాని భర్త తాను మహా జ్యోతిశ్శాస్త్ర పండితుడు కావాలనే పిచ్చిలో పడి జ్యోతిశ్శాస్త్ర గ్రంథాలను ముందు వేసు కొని భార్యను కన్నెత్తయినా చూచేవాడు కాదు. విరహవేదనతో ఆమె కుమిలిపోసాగింది.

ఈ ఉపోద్ఘాతం వినేసరికి అంతా కుతూహలంగా తనవైపే చూడసాగారు దాన్ని గమనించిన రఘు రామయ్య ఉత్సాహంతో మళ్ళీ ప్రారంభించాడు.

ఆమె ఒక తాటాకు మీద తన వేదనంతా వివ రిస్తూ భర్తకు లేఖ వ్రాసింది.

ఏమని అంటు కుతూహలంగా అంతా ముక్త కంఠంతో అన్నారు. ఇందాక నవనీత చదివిందే ఆ శ్లోకాన్నే వ్రాసింది. అంటూ రఘురామయ్య దాని అర్థాన్ని యిలా వివరించాడు.

రాసులు పండ్రెండని మీ అందరికీ తెలుసు కదా. ఆ రాసుల పేర్లతోనే జ్యోతిషం పిచ్చి పట్టిన భర్తకు బుద్ధి వచ్చేలా లేఖ వ్రాసింది.

ఉపోద్ఘాతంతోనే సగం పెట్టి ఊరిస్తున్నావు. అసలు విషయమేమి చెప్పవేమి మామయ్యా అంటూ తీరిగా కూర్చోవడానికి సర్దుకుంటున్న ప్రసాదును చూచి

సరే విను మరి అంటు ప్రారంభించాడు.

రాసుల్లో పదవది మకరము. అది ధ్వజము (జెండా)గా కలవాడు మన్మథుడు. అతడు అదిగాక ఆద్య = మొదటిదైన రాశి మేషం. అది వాహనంగా గల (నడకకల) వాడు అగ్ని, మన్మథుడూ అగ్ని మూర్తుడై నన్ను ఈ మూడు సంవత్సరాల నుండి విరహ వేదనకు గురిచేస్తున్నాడు.

ఆ మన్మథాగ్నికి తాళలేక తుర్య = నాల్గవరాశి కర్కాటకము (ఎండ్రి) ద్వాదశ = పండ్రెండవ రాశి మీనం (చేప) కూ రెండూ నిర్జలా = నీళ్ళలో నుండి బయటపడినపుడు ఏ విధంగా, సమ్మూర్ఛితా = స్పృహను కోల్పోతాయో అలాగే నేను కూడ విరహ వేదనను తాళలేక స్పృహను కోల్పోయాను. ఓ నాథా నన్నేల ఆదరింపవు

పెండ్లయి మూడేండ్లు గడచినా నేను సా షష్ఠీ = ఆరవరాశి అయిన కన్య లాగనే మిగిలిపోయాను.

ప్రియా! నేను కురూపినా. కాదే. శర = ఐదవరాశి సింహము వలె, మధ్యమా = సన్నని నడుము కల సొగసుకత్తెను అంతేకాదు. ఏకాదశ = పదునొకండవ రాశి కుంభము వలె, బలిష్ఠమయిన స్తనీ = స్తనములు కల నవ యౌవనవతిని. అంతేకాదు నవమ = తొమ్మి దవ రాశి ధనుస్సు వలె వంగిన భ్రూ = కనుబొమలు కల నేత్రసౌందర్యము కలదానను. అందుచేత అందంలో నేను, సప్తమీ = ఏడవరాశి తుల (పోలిక) వర్జితా = లేనిదానను. ఇట్టి నన్ను ఈ జ్యోతిశ్శాస్త్రం పిచ్చిలో పడి ఏల కన్నెత్తి చూడవు? ఈ మూడు సంవత్సరాల నుండి నా విరహబాధ భరింపరానిదై యున్నది. ఎట్లంటే అష్టమ = ఎనిమిదవ రాశి వృశ్చి కం (తేలు) కుట్టినట్టు, వేదనాం = బాధను ప్రాప్నోతి

= పొందుతున్నాను. ఈ విధంగా బాధపడుతున్న నన్ను నీవు ఇప్పుడైనా అనుగ్రహించకపోతే ద్వితీయ మతిమంతుడవే కాలేవు...

ఇంకా ఏదో చెప్పబోయి రఘురామయ్య మధ్య లోనే ఆపివేశాడు. ఇంకా ద్వితీయ మతి ఎందుకంటే ఏమిటి... ఏమిటి.... అంటూ ముక్తకంఠంతో అడగ సాగారు.

చెప్పమంటారా? సరే చెప్తాను. విని ఎవరూ తమ మీద పెట్టుకొని బాధపడకండి. అంటు రఘురామయ్య ప్రారంభించాడు.

రెండవరాశి వృషభము' అంటె ఎద్దు, ఎద్దు మొద్దు లాంటి, మతిమన్ = బుద్ధి కలవాడా! అని అర్థం. విరహవేదనతో నీటిని విడిచిన ఎండ్రి = చేపల్లా మూర్ఛితురాలనై, తేలు కుట్టినట్లుసంతాపమును బొందు చున్న నాతో ఇకనైన తూర్ణం = వెంటనే, తృతీయో భవ = మూడవరాశి మిధునం అంటె జంటగా అగుము అంటు పాపమా నవోఢ పతిదేవుణ్ణి ప్రార్థించింది.

కనీసమామెకు పెండ్లయినా అయింది కాబట్టి భర్త నావిధంగా ప్రార్థించింది. కాని యిప్పుడో జ్యోతిశ్శాస్త్రం పిచ్చిలో పడి అన్ని విధాల తగిన అందమైన కన్నె పిల్లల్ని తిరస్కరించే యువకులున్న యీ రోజుల్లో ఆ కన్నెపిల్లలు ఎవరిని ప్రార్థించాలి? ఎలా ప్రార్థించాలి?

అని రఘురామయ్య ప్రశ్నార్థకంగా అందరి ముఖాల వంక చూచి గంభీరంగా కూర్చున్నాడు.

ఆ కవితా చమత్కారానికి అందరి ముఖాలు వికసించిపోయాయి 'ఏరా తమ్ముడూ' మా ప్రసాదు ఎప్పటిమొద్దు బుద్ధి పోయిందా? ఈ పిల్ల అభిప్రాయం? బుద్ధిలో బృహస్పతి లాంటి అమ్మాయిని పట్టుకొని ఇలా హేళన చేయటం బాగులేదు' మూర్తి విసుకొంది ప్రసాదు పిన్ని.

'కాకపోతే! బుద్ధిలో బృహస్పతి కాబట్టే సరసంగా అర్థం చేసికొని ప్రసన్నుడవకపోవాలా అనేఅభిప్రాయం తోనే ఈ అమ్మాయి ఈ శ్లోకం చదివింది. నీవన్నట్టు మా కృష్ణప్రసాదు బుద్ధిలో బృహస్పతియే కాదు సర సంలో శ్రీకృష్ణుడు కూడా. ఆ పేరు నిప్పుడు వ్యర్థం చేసికొంటాడంటారా?'

అక్కడ ఉద్దేశించి అన్నా రఘురామయ్య చూపు లన్నీ సాభిప్రాయంగా కృష్ణప్రసాదు మీదే పడ్డాయి.

'అయితే దీని కంతటికి సూత్రధారులు మా మాతా సహోదరులే తప్ప మాట....' అంటు మామయ్య వంక తీక్షణంగాచూసినా మనస్సులోని ప్రేమార్ద్రితమాత్రం తొంగి చూచింది ప్రసాదు మాటల్లో.

'ఇప్పుడు నిజంగా బుద్ధిలో బృహస్పతి వనిపించు కొన్నావురా ప్రసాదు. ఇక కృష్ణప్రసాదు అని అని పించుకొంటె అంతా సంతోషిస్తారురా' అంటు కృష్ణ ప్రసాదు భుజం మీద తడుతు రఘురామయ్య లేచాడు. వెంటని అందరు లేచారు.

అందరు కోరుకొన్నట్టు ప్రసాదు నిజంగా కృష్ణ ప్రసాదు అనిపించుకున్నాడు. నవనీత కృష్ణప్రసాదులు దంపతులయ్యారు.

మన హీరో? ......

జూనియర్ లెక్చరర్,
ప్రభుత్వ జూనియర్ కళాశాల,
పెనుగొండ-515 110.

హిందీమూలం :

**స్వామి కుశాల్‌నాథ్ 'ధీర్'**

తెలుగు సేత ;

**చిలుకమూరి సంజీవ**

మిత్రులారా!
కుల, మతాల పేర
ఐక్యతను బదనాము చేయకండి
'పంచప్యారాల ధరణిపైన
విద్వేషాన్ని ఎగజల్లకండి
అమృత - సరాన్ని
అమృతసర్‌గానే ఉండనీయండి
పంజాబు గరిమపై
నలుపును పులుమకండి
కావాలనుకుంటే
పంచ ప్యారాలు కండి
జయ చంద్రులు కాకండి
నానక ప్రేమను
రక్త నమస్కారం చేయకండి
ప్రేమను ద్వేషంగా మార్చకు
నేనింత వరకు
పవిత్ర జలంతోనే
పాద ప్రక్షాళనం చేస్తూ వచ్చాను
రక్తంతో కడిగేట్లు బలవంతం చేయకండి.
రాబోయే తరం
నానక పుత్రులను
ద్వేషించే చరిత్రపుటలు జోడించకండి
ఆరాధనను ఆరాధనగానే ఉంచండి
గురునానక ప్రేమను
రక్తంతో ఆరాధించకండి
పంజాబు గౌరవాన్ని
కళంక పరచకండి
ఉచ్చరించ వలసింది
నిర్మాణాత్మక స్వరాన్ని
విధ్వంసాన్ని కాదు.
ఆర్జిత కీర్తిని ఇలా నష్టపరచకండి
మీ కాళ్ళకు మీరే గొడ్డలితో నరుక్కోకండి
నేపథ్య గుడ్లగూబల
కీలు బొమ్మలు కాకండి
ఉద్బోధివి కావాలంటే
గురుగ్రంథ సాహెబు గీతాలను పఠించు.

మిత్రులారా?
విఘటితం కాదు
సంఘటితం కావాలి
ఉగ్రవాదాన్ని నిరసించండి
మానవతా వాదాన్ని పెంచండి
జనతా హృదయాన్ని
నినాదాలతో కాకుండ
ప్రవర్తనతో జయించండి
రణజిత్‌సింహు దేలిన ఈ భూమిని
రంగులు మార్చే ఊసరవెల్లిని చేయకండి
మరొక 'మెకాలే'ను పుట్టనీయకండి
భాష పేరుతో హృదయాలను విడదీయకండి
పంజాబును
ఇరాన్ ఇరాక్‌గా మార్చకండి
పంజాబును పంజాబుగానే ఉంచండి.

హిందీ లెక్చరర్
కాకతీయ విశ్వవిద్యాలయం
వరంగల్

# పాదుకా పురాణం

కన్నడ మూలం :
డా॥ మాస్తి వెంకటేశ అయ్యంగారు

తెలిగింపు :
శంకరగంటి రంగాచార్యులు

విలువైన చెప్పుల్ని వెలుపల వదిలి, లోనికివెళ్ళి, దేవుడి సన్నిధిలో నిలుచుంటే, చెప్పుల ధ్యానం తప్ప, దేవుడి ధ్యానం వుండదు అన్నారు-అన్న బసవన్న. అన్నగారి ఈ వాక్యం చదివినపుడు నాకు, నేను చెప్పుల్ని పోగొట్టుకున్న సందర్భాలు మతికొస్తాయి. బసవన్నగారు ఎప్పుడైనా దేవుడి సన్నిధికివెళ్ళి, నిలుచున్నపుడు, చెప్పులుకావాలి, అయితే కొనుక్కోవడానికి డబ్బులేదు అనే పేదవాడొకడు వారు వెలుపల వదలిన చెప్పుల్ని తొడుక్కుని వెళ్ళిపోయాడేమో ? నాకు అలా చెప్పుల్ని పోగొట్టుకున్న అనుభవం అయిదుసార్లు కలిగింది. అదేమి విచిత్రమో, అయిదు సార్లూ ఈ పోగొట్టుకోవడం నేనొక దేవళంలోకి వెళ్ళినప్పుడే జరిగింది. దీన్ని గురించే నేనొక ఉపన్యాసం రాయగలను.

ఇపుడా ఉపన్యాసాన్ని రాయను నా మిత్రుడు శేషప్పగారు ఒక జత చెప్పుల్ని పోగొట్టుకొని, మళ్ళీ కనుక్కొన్న సంగతిని గురించి చెప్తాను.

శేషప్ప సెక్రెటేరియట్‌లో గుమాస్తా. తగినంత మంచి జీతమే వస్తోంది. ఎంతయినా గుమాస్తా జీతమే కదా? ఎక్కువేంకాదు కాగా, ఆయనకు మంచి ధోవతి కట్టాలి; మంచి చెప్పులు వేసుకోవాలి-అనే చాపల్యం. భార్య మంచి చీర కట్టుకోవాలని కూడా ఇష్టముంది. అయితే అది సులభంగా తీర్చుకోవడానికి వీలయిన కోరికకాదు. చెప్పుల చాపల్యాన్ని, ధోవతి చాపల్యాన్ని తీర్చుకోవడం అంత కష్టం కాదు. వారు సామాన్యంగా మంచి చెప్పుల్నే కొంటారు; మంచి పంచెల్నే కడతారు. అయితే చెప్పులిప్పుడు విపరీతం వెలగల వస్తువులయ్యాయి. బహు పెద్దజీతాల భాగ్యవంతులు మాత్రమే ఇపుడు నిజంగా మంచివనబడే చెప్పుల రకాల్ని కొనగలరు. కొద్ది ఏళ్ళక్రితం చాలా మంచి చెప్పులజత ఇరవై రూపాయలకు దొరకుతుండేది. ఆ రోజుల్లో శేషప్ప ఒక జత చెప్పుల్ని కొనుక్కొని వున్నారు. ఎక్కువగా ఉపయోగించకుండా వాటికి కొంచెంగానే పనికల్పించి, వాటిని దీర్ఘాయువుగలవిగా చేసి వున్నారు.

నా మిత్రుడు జనార్దనరావు శ్రీమంతుడైన వ్యాపారి అయన తన ఇంట్లో ప్రతీ ఆదివారమూ రాత్రి ఎనిమిదిన్నర గంటలనించీ పదిగంటలవరకూ ఒక పండితుడిచేత రామాయణాన్ని చదివించే కార్యక్రమాన్ని ఏర్పాటు చేయించారు. ఆ కార్యక్రమానికి ఎవరైనా రావచ్చునని ఆ చుట్టుప్రక్కల్లో వున్న అందరికీ తెలిపారు. తమకు పరిచితులైన పెద్దమనుషులకు ప్రత్యేకంగా ఆహ్వాన పత్రికలు పంపారు నేను చాలా మార్లు ఈ కథ వినడానికి వెళ్ళాను. పండితుడు రామాయణపు మూలశ్లోకాన్ని చదివి, అర్థం వివరించేవాడు. ఇలాంటి రససంతర్పణ మరింకెక్కడుంటుంది ? ఒకొక్క దినమూ నేను కథాశ్రవణం వల్ల సుఖించెంది బతుకు పదములవైందని ఉప్పొంగి, సంతోషంతో వెనుదిరిగి వచ్చేవాణ్ణి.

ఒకరోజు నేను రామకథాశ్రవణానికి వెళుతూన్నప్పుడు దారిలో శేషప్ప కనిపించి, నేనూ వస్తానన్నారు. మేమిద్దరమూ వెళ్ళాము. కార్యక్రమం ఆ రోజుకు ముగిసింది ఇద్దరమూ బయటికొచ్చాం. నేను నా చెప్పుల్ని వదలినచోట బాగా గుర్తుంచుకొన్నాను. శేషప్ప తన చెప్పుల్ని నాచెప్పుల ప్రక్కనే వదిలాడు. ఇంటికి వెళ్ళేటప్పుడు నేను తొడుక్కున్న చెప్పుల ప్రక్కన వున్న చెప్పుల్నే తొడుక్కొని నాతోపాటు వచ్చారు.

మరునటిరోజు వారు చూస్తారుగదా! ఇప్పటి విలువైన బహుమంచి చెప్పుల జత ఇంటికి వచ్చివుంది !!

"అయ్యో, రాముని కథ వినడానికి వెళ్ళి, జోళ్ళు దొంగిలించుకుని వచ్చానే!" అని వారికి మిక్కిలి దుఃఖం కలిగింది. చింతామగ్నులై నిలుచున్నారు. వారి శ్రీమతి దగ్గరకొచ్చింది. "ఎందుకిలా నిలబడ్డారు?" అంది. శేషప్ప విషయం చెప్పారు. ఆమె చెప్పుల్ని చూసింది. మంచి మేలిరకపు కొత్త జత. హాస్యంగా "చింతించకండి. కావాలని దొంగిలించారా? తమకుతామే వచ్చాయి. డబ్బిచ్చి కొనుక్కోడానికయ్యేదా? ఈ వారఫలాల్లో మీ నక్షత్రానికి ఎదురు చూడని అదృష్టమని ఒక వాక్యముండాలి. ఎందుకు చింతిస్తారు?" అంది నవ్వుతూ. శేషప్ప కూడా ఆమెతోపాటు నవ్వాడు. "ఎదురు చూడని అదృష్టమే అయితే పట్టి చెప్పుల అదృష్టమే కావాలా?" అనుకున్నాడు.

ఆ మీద మూడు తడవలు శేషప్ప కథా శ్రవణానికి తప్పకుండా వెళ్ళారు. ఈ కొత్త జోళ్ళను లోనికి వెళ్ళే వాకిలివద్ద అందరికీ కానవచ్చేటట్టు ఒక చివర వదిలేవాడు. ఆయన ఆలోచన ఏమంటే- ఈ చెప్పుల్ని పోగొట్టుకున్న గృహస్థు తన చెప్పుల్ని గుర్తించి తీసుకుని వెళ్ళేట్టుంటే అలాగే చేయనీ- అని.

"ఎవరైనా పోగొట్టుకున్నారా?" అంటూ అడుగుదామని ఒక ఆలోచన. చెప్పులు బాగుండటం చూసి ఎవరో కపటంగా, "ఔను, నేను పోగొట్టుకున్నాను. అంటే ప్రయత్నం విఫలమవుతుంది అందుచేత అడగడం వద్దు పోగొట్టుకున్న వాడు గుర్తించనీ, తీసుకోనీ గుర్తించకేడనుకో. చెప్పులు నావద్దనే ఉండనీ- ఇది వారి మనస్సు ఆలోచించిన విధం.

నాలుగోసారి వీరు చెప్పుల్ని బయటవదలి లోపలికి వెళ్ళివున్నారు. కథ వినడానికి వచ్చిన పెద్ద మనిషి ఒకరు ఏమో పని తోచనట్టు మధ్యలో లేచారు. అతిథికి వీడ్కోలివ్వడానికి జనార్ధనరావు గారు కూడా బయటికొచ్చారు వారితో పాటు వారిని పంపి మళ్ళీ లోనికొచ్చారు కథ నడిచింది ముగిసింది అందరూ ఇళ్ళకెళ్ళిపోవడానికి సిద్ధమయ్యారు శేషప్పగారూ లేచారు బయటికొచ్చారు, వచ్చి తాము చెప్పుల్ని వదలిన చోట్లో చూశారు. అక్కడ తమ పాత చెప్పుల జత వుంది. కొంచెం ఆశ్చర్యంగా శేషప్ప ఆ దృశ్యాన్ని చూస్తూన్నారు. జనార్ధనరావు వచ్చారు. "ఏం చూస్తున్నారు, స్వామీ?" అంటూ అడిగాడు. "ఇది నేను వదలిన చెప్పుల జత కాదు, వేరే చెప్పుల జత. ఆ చెప్పుల్ని ఎవరు తీసుకొని పోయి వుంటారు? అనుకుంటూ చూస్తూన్నాను." అన్నారు.

జనార్ధనరావు, "కథ చెప్పడం జరుగుతూన్నపుడు మధ్యలోపని వుందని లేచి వెళ్ళారుగదా, లాయరు శేషప్ప గారు- వారు బయటికి వచ్చి, ఆ చెప్పుల జతని చూసి "మూడు వారాల క్రితం నేనిక్కడికి వచ్చినపుడు ఈ జోళ్ళని తెచ్చాను తిరిగి వెళ్ళేటప్పుడు ఇవి ఇక్కడ వదలి వచ్చిన వాళ్ళంతా తమ చెప్పుల్ని వేసుకొని వెళ్ళిన తర్వాత ఒక జత మిగిలి ఉన్నాయి. నేనా చెప్పుల్ని వేసుకుని చూశాను, ఆశ్చర్యం! అవి నా కాళ్ళకి సరిగ్గా సరిపోయాయి. ఎవరో పాపం! తెలియక నా చెప్పుల్ని తొడుక్కొని వెళ్ళివున్నారు దొంగిలించి వుండరు, వారి చెప్పులిక్కడే వున్నాయి ఏమీ మాట్లాడకుండా వాటిని

తొడుక్కొని ఇంటికెళ్ళాను. మూడు వారాల క్రితం కదా. విషయమంతగా నా మనస్సుకు గుర్తులేదు. ఇపుడు చూడండి ఆ నా చెప్పులిక్కడున్నాయి నేను వీటిని తొడుక్కొని వెడతాను. సభ ముగిసిన తరువాత ఎవరైనా తమ కొత్త చెప్పులు పోయాయంటే నాకు తెలపండి. నేను వీటిని వెనక్కిస్తాను పోయినాయి అనలేదనండి. ఆ రోజు నేను తొడుక్కొని పోయిన చెప్పులిక్కడున్నాయి. వీటిని వారికి చూపండి. ఇవి వాళ్ళవయితే వాళ్ళు తీసుకోనీండి " అని తెలిపారు

శేషప్ప, "లాయరు శేషప్పగారా? నేను వారి నెరుగుదును మూడు వారాల క్రితం మనక వెలుతుర్లో ఆ కొత్త జోళ్ళను నావి అనుకొని వేసుకుని ఇంటి కెళ్ళాను. ఇంటికెళ్ళినాక చెప్పులు మార్పిడి అయి వుండటం గమనించాను. మరొకసారి కొత్తచెప్పుల యజమాని వచ్చి, కొత్తచెప్పుల్ని ఇక్కడ చూసి, తొడుక్కొని వెళ్ళితే మంచిదే అని తలచే మూడుపొద్దు తప్పక కథ వినడానికి వచ్చాను. ఈ దినం నా ఆశ ఫలించింది." అన్నారు.

"ఈ చెప్పులు మీవేనా ?"

"ఔను"

"తమరెంతటి సత్యవంతులండీ తమరిని చూశాను. తమ పేరు?

"శేషప్ప"

"అయ్యా ఆ చెప్పుల నేర్పరితనం చూశారా? శేషప్పగారి చెప్పులు వేరే ఎవరి కాళ్ళో ఎందుకు పడతాం! శేషప్పగారి కాళ్ళే పడతాయి అంటూ మీ కాళ్ళే పట్టాయి కదా? ఇందుకేమంటారు.

శేషప్ప సాయంత్రం తమ పాత జోళ్ళు తొడుక్కొని ఇంటికొచ్చారు. మరునాటిరోజు ప్రొద్దున వారి అర్ధాంగి పాతజోళ్ళని చూసి "ఏం, కొత్తచెప్పుల యజమాని వాటిని గుర్తించి తీసుకెళ్ళారా? అంటూ అడిగింది.

"ఔను"

"అంటే ఈ వారఫలాల్లో మీ నక్షత్రానికి పాత పెళ్ళాం, పాత బట్టలూ, పాత చెప్పులే ప్రాప్తి అంటూ రాసివుండాలని తోస్తుంది."

శేషప్ప, "ఏం తప్పు? మూడు బాగానే వున్నాయి అన్నారు.

హెడ్‌మాస్టర్ రాళ్ళపల్లి
జడ్ పి. హెచ్. స్కూల్, మడకసిర (తాలూకా)
అనంతపూర్ జిల్లా పిన్- ౫౧౫ ౩౦౫.

## దక్షిణ భారత హిందీ ప్రచార సభ- ఆంధ్ర, హైదరాబాద్
## స్వర్ణోత్సవ హిందీ పరిచయ పరీక్షా కార్యక్రమం

పరీక్షతేది : 19-4-1987

శుల్కసహితముగా పరీక్షార్థుల వివరం పంపవలసిన తేది 6-4-1987

ప్రచారకులు అధికసంఖ్యలో పరీక్షార్థులను తయారుచేసి సహకరించ ప్రార్థన.

ఎ. రామస్వామి
కార్యదర్శి

# కడప మాండలికం

— అవధానం ఉమామహేశ్వరశాస్త్రి

భాషలు మాండలికాలుగా, మాండలికాలు భాషలుగా రూపొందుతాయనే సిద్ధాంతం ఆధారంగా మూల భాషా పునర్నిర్మాణానికి ఎన్నో ప్రయత్నాలు జరిగినాయి. జరుగుతున్నాయి ప్రాంతీయ మాండలికాల సమగ్ర అధ్యయనం ఈ ప్రయత్నాలకు సంపూర్ణతను చేకూరుస్తుందని నా విశ్వాసం. భాషాప్రయుక్త రాష్ట్రంగా ఏర్పడిన ఆంధ్రదేశంలో నాలుగు భాషా మండలాలను పరిశోధకులు గుర్తించారు. అందులో దక్షిణ మండలంగా గుర్తింపబడిన రాయలసీమ మాండలికం, ఇతర మాండలికాల కంటె ఎక్కువగా ప్రాచీనతను నిలుపుకున్నట్లు పరిశోధనలు వెల్లడిస్తున్నాయి. ప్రాచీన మహాకవి ప్రయోగాలెన్నో ఈ ప్రాంతంలో ఇంకా జన వ్యవహారంలో వున్నాయి. రాజకీయ ఆర్థిక కారణాల వల్ల ప్రస్తుతం మధ్య మండలంలోని శిష్ట వ్యవహార భాషను మనం ప్రమాణిక భాషగా స్వీకరిస్తున్నా చారిత్రక దృష్టితో పరిశీలిస్తే దక్షిణ మండలంలోని వ్యవహార భాష ప్రాచీన తెలుగు భాషా పరిణామ విశేషమని నిస్సందేహంగా చెప్పవచ్చు.

దక్షిణ మండలానికి కడప నడిబొడ్డు. ఉత్తరంలో కర్నూలు, ప్రకాశం తూర్పున నెల్లూరు, దక్షిణంలో చిత్తూరు, పడమట అనంతపురం జిల్లాలు ఈప్రాంతాన్ని చుట్టి వున్నాయి. అనంతపురం సరిహద్దులో తెలుగు-కన్నడ భాషల వ్యవహార భేదరేఖ (isoglass), చిత్తూరు సరిహద్దులో తెలుగు-తమిళ భాషల వ్యవహారభేదరేఖ వున్నాయి. అందువల్ల ఈ జిల్లాలలో ఆయాభాషలు విడిపోక పూర్వంనాటి స్థితి వ్యవహారంలో కొంత కనిపిస్తుంది. కర్నూలు జిల్లా తెలంగాణా ప్రాంతమైన మహబూబ్‌నగర్‌ను ఆనుకొని వుండటంవల్ల వ్యవహారంలో ఉర్దూభాషా ప్రభావం కనిపిస్తుంది. కర్ణాటకను ఆనుకొని వున్న ప్రాంతాలలో తెలుగు-కన్నడ వ్యవహారం కనిపిస్తుంది. నెల్లూరు జిల్లా వ్యవహారంలో మధ్యమండల వ్యవహార లక్షణాలు, కొంత తమిళ ఉచ్చారణ లక్షణాలూ కలిసి వున్నాయి ఈ వ్యవహారభేదరేఖలనుండి దూరమైన కొద్దీ వినిపించే వ్యవహారభాష ఇతర ప్రాంతీయమాండలికాలకంటె విలక్షణంగా వుండడంలో విప్రతిపత్తి ఏమీ లేదు.

ఏ భాషలోనైనా సాధారణంగా సరిహద్దు ప్రాంతాలలో వ్యవహారంలో వుండే భాషకూ, మధ్య ప్రాంతంలో వ్యవహృతమయ్యే భాషకూ గుర్తింపదగిన వైవిధ్యం వుంటుంది. వ్యవహారభేదరేఖకు దగ్గరగా వున్న ప్రాంతాలలో సహజ స్వరూప సంరక్షణ ప్రయత్నంవల్ల ప్రాచీన రూపాలు, పట్టుతప్పక నిలిచి వుంటాయి వ్యవహారభేదరేఖల మధ్య ప్రాంతాలలో భాష ఆరుగుదలకు గురికావడంవల్ల పరిణామానికి లోనవుతుంది ఈ దృష్టితో కడప ప్రాంతీయమాండలికం దక్షిణ మాండలికానికి కేంద్రకంగా భావించవచ్చు.

ఈ ప్రాంతంలో వ్యవహారంలో వున్న మాండలిక భాషకు సంబంధించిన విశ్లేషణాత్మక పరిశీలన ఈ వ్యాస ఉద్దేశ్యం. ఈ పరిశీలన ఎక్కువభాగం శిష్టేతర వ్యవహారాన్ని దృష్టిలోవుంచుకొని చేయబడింది

I. వర్ణవిజ్ఞానం :-

ధ్వనుల సర్దుబాట్లు :-

ఉచ్చారణలో అరుగుదల వల్ల ధ్వనులలో కొన్ని సర్దుబాట్లు కనిపిస్తాయి దక్షిణ మండలంలోని ఇతర ప్రాంతాలలో విరళంగా, ఈ జిల్లాలో సాధారణంగా కనిపించే కొన్ని సర్దుబాట్లను ఇక్కడ చూపడం జరిగింది. ఈ సర్దుబాట్లను మూడు భాగాలుగా చూడవచ్చు.

(1) అచ్చులు (2) హల్లులు (3) సంయుక్తాక్షరాలు.

అచ్చులు

| | | |
|---|---|---|
| అ/ఇ | కోమటి-కోమిటి | (పదమధ్యం) |
| ఒ/ఎ | ఎగ్గం-మొగ్గం | (పదాది) |
| అ/ఉ | పెసలు-పెసులు | (పదమధ్యం) |
| ఉ/అ | ఉగ్గువ-ఉగ్గవ | (పదమధ్యం) |
| ఓ/ఆ | మోరగుడి-మారగుడి | (పదాది) |

హల్లులు:

| | | |
|---|---|---|
| చ/స | చెయ్యి-సెయ్యి | (పదాది) |
| | చెప్పు-సెప్పు | (పదాది) |
| త/చ | తిత్తి-చిత్తి | (పదాది) |
| ద/జ | దిష్టి-జిష్టి | (పదాది) |
| న/మ | నిచ్చెన-మిచ్చెన | (పదాది) |
| ప/గ | పునాది-గునాది | (పదాది) |
| ల/న | చోల-చాన | (పదాంతం) |
| వ/గ | త్రవ్వు-తొగు | (పదాంతం) |
| శ/చ | శనక్కాయలు-చెనిక్కాయలు | (పదాది) |
| | శెట్టిపల్లె-చెట్టిపల్లె | |
| స/చ | సేపు-చేపు | (పదాది) |

సంయుక్తాక్షరాలు :

| | | |
|---|---|---|
| క్ష/చ్చ | లక్ష-లచ్చ | (పదాంతం) |
| | సాక్షి-సాచ్చి | |
| | పక్షి-పచ్చి | |
| స్త్ర/చ్చ | జాస్తి-జాచ్చి | (పదాంతం) |
| | వస్తా-వచ్చా | |

వర్ణసమీకరణం

రెండు భిన్న ధ్వనులు ఒకదానిస్వభావాన్ని బట్టి మరొకటిమారిపోవడం 'వర్ణసమీకరణం'. ఈ మార్పు అచ్చుల్లోనూ, హల్లుల్లోనూ రెంటిలోనూ జరుగుతుంది. ఉదా పాత్రలు = పాత్తర్లు, బద్వేలు = బద్దేలి, కోర్టు = కోట్టు, సేద్యం = సేద్దెం, అర్థ = అద్ధ.

వర్ణవ్యత్యయం.- ఊర్లో = వూల్రో, గొర్లు = గొ్రలు

లోపదీర్ఘత:-

ఒక వర్ణం లోపించడం వల్ల దానికి ముందున్న అచ్చు దీర్ఘం కావడం. ఉదా : కొడవలి = కొడేలి, గడ్డపార = గడార, ఓయ్యం = బీం.

పదం మధ్యలో ఒక అచ్చు లోపించి ముందు హల్లు తర్వాతి హల్లుతో సంశ్లేషాన్ని పొందడం. ఉదా: గొడ్డలి = గొడ్లి

వర్ణాగమం :

ఉచ్చారణలో ఒక వర్ణం అధికంగా రావడం ఉదా: వేషం = ఏస్యం

దీర్ఘాచ్చుమీద పూర్ణానుస్వారం :

కాంచు, తూంచు దూంకు, పీంద, ఊంచు మొదలైన పదాలలో పూర్వం వున్న అనునాసికం లోపించి అర్ధానుస్వారంగా కావ్యభాషలో ఉపయోగింపబడింది. అర్ధానుస్వారాన్ని పూర్ణానుస్వారంగా ప్రయోగిస్తే సాధ్యపూర్ణం అంటారు. దీర్ఘం మీద సాధ్యపూర్ణం లేదని వ్యాకర్తలు విధించినారు. కాని ఇక్కడి వ్యవహారంలో కాంచు, తూంచు, దూంకు, పీంద, ఊంచు వంటి రూపాలలో దీర్ఘంమీద పూర్ణానుస్వారం ఇంకా మిగిలి వుంది.

ప్రాస్వాచ్చుమీద అనునాసికం:-

అంటు ఇంక, చుండు శబ్దాలలో పదం తొలి హ్రస్వం మీద ఖండ బిందువు వుంటుందని వ్యాకరణం చెప్తుంది. ఇక్కడి వ్యవహారంలో పూర్ణబిందువుతో కూడిన అంట, ఇంగ, అనే రూపాలున్నాయి.

నకారం బిందువుగా మారడం:-

అనంతరార్థంలో ప్రయోగింపబడే 'ఆనక' అనే పదం పూర్వపదంతో కలిసి ప్రవర్తించినప్పుడు 'ఆంక'గా మారుతుంది. ఉదా : తిన్నాంక వరకు అనే అర్థంలో వాడబడే 'దనుక' పూర్వపదంతో చేరి 'దాంక'గా మారుతుంది. ఉదా: అడిదాంకా = అక్కడి వరకు

స్వరభక్తి :

భిన్న హల్లులమధ్య సమీకరణం జరిగినప్పుడు వాటి మధ్య ఒక హ్రస్వాచ్చు చేరుతుంది. రూపాల్లో వర్ణాధిక్యం ఏర్పడుతుంది. ఉదా: భద్రం = బద్దరం, శుభ్రం = సుబ్బరం, ముద్ర = ముద్దర. స్వరభక్తి జరిగే సందర్భాలు సాధారణంగా అన్యదేశ్యాలకు సంబంధించినవిగా వుంటాయి.

## 2. పదాంశ విజ్ఞానం

నామవిభక్తులు:-

ప్రథమేతర విభక్త్యంగం 'వాని' రాయల సీమలో ఇంకా మిగిలివుంది. కోస్తాలో 'వాడి' వ్యవహారంలో వుంది వాన్ం (ప్రాచీనాంధ్ర) = అవన్ (మూ.ద్రా)

ద్వితీయ : వాడు + ని — వాన్ + ని = వాన్ని

తృతీయ : వాన్ + ఇ + తో = వాన్తో; ఇక్కడ 'ఇ' లోపిస్తుంది.

చతుర్థి : వానికోసం

పంచమి : వానివల్ల 'తో' కూడా ఈ విభక్త్యర్థంలో వ్యవహారంలో వుంది. ఉదా : వాన్తో జరగదు.

షష్ఠీ : వానికి

స్థలకాలార్థాల్లో వచ్చే ప్రత్యయం 'నుండి'కి ఈ మండలంలో సించి/నుంచి అనే వ్యవహారం కనిపిస్తుంది. కాలార్థంలో ఈడి, యాల/ఏల వ్యవహారంలో వున్నాయి ఉదా: పొద్దనీడి, మాయిటేల/మాటేల, యాలపొద్దు. సహార్థంలో 'కూడ' అన్న పదానికి 'క' ఆద్యాగమంగా వస్తుంది. ఉదా: నేను గూడ్కా.

బహువచనం:-

1 బహువచనం పరమైనప్పుడు పదం చివరి అచ్చు లోపించడం, చివరిహల్లు సమీకరణం పొంది లకార ద్విత్వంతో కూడిన రూపాలు ఏర్పడటం కనిపిస్తుంది. ఉదా : గోడ + లు = గోల్లు, కన్ను + లు = కల్లు, మడి + లు = మల్లు,

2 చివరి హల్లు 'ర'గా వుంటే వర్ణ వ్యత్యయం జరుగుతుంది. ఉదా : గొర్రె + లు = గొర్లు

3 విధిలో మధ్యమపురుష బహువచనం '-ండి'కి బదులుగా '-ల్లి/-ర్రి'తో కూడిన రూపాలు వ్యవహారంలో వున్నాయి. ఉదా : జాబురాయండి-జాబు రాయల్లి/జాబురాయ్రి పోండి -పోల్లి/పోర్రి, కూర్చోండి-కూకోల్లి/కూకోర్రి.

క్రియలు :

భూతకాలం :

| | ఏ | బి |
|---|---|---|
| ఉ. | వచ్చిన్నే | వచ్చిన్నేం |
| మ | వచ్చిన్నేవ్ | వచ్చిన్నేరు |
| ప్ర. | వచ్చిన్నేడు | వచ్చిన్నేరు |
| | వచ్చిన్నేడి | వచ్చిన్నేయి |

ఈ రూపాలు అద్యతన, అనద్యతన భూతకాలార్థాల్లో రెండింటిలోనూ వినిపిస్తాయి.

వర్తమానకాలం :

| | ఏ | బి |
|---|---|---|
| ఉ. | వచ్చొంటా | వచ్చొన్నాం |

| | | |
|---|---|---|
| మ. | వచ్చొండావ్ | వచ్చొండారు |
| ప్ర. | వచ్చొన్నాడు | వచ్చొండారు |
| | వచ్చొంది | వచ్చొండాయ్ |

'వస్తాన్నా/వస్తావున్నా' అనేరూపాలు విద్యావంతుల వ్యవహారంలో మాత్రమే వున్నాయి. 'వస్తొండా' అనేరూపం శిష్ట శిష్టేతర వ్యవహారాలు రెండింటిలోనూ కనిపిస్తుంది.

*భవిష్యత్తద్ధర్మ కాలాలు :*

భవిష్యత్తద్ధర్మ కాలాలు చాలవరకు ఒకే విధంగా వుంటాయి సందర్భాన్ని బట్టి అర్థగ్రహణం జరుగుతుంది. ఉదా: వచ్చాడు.

*విధ్యర్థం :*

ఇతర రాయలసీమ ప్రాంతాలలో లాగానే '-అల' అనే ప్రత్యయం చేరుతుంది. ఉదా: చెయ్యాల, మధ్యమపురుష క్రియారూపాలు కొన్ని యథాతథంగా విధ్యర్థంలో వ్యవహారంలో వున్నాయి ఉదా: ఉండు, విను, తిను. 'చచ్చు'-'సావు' గాను 'చేయు'-'సెయ్యి' గాను వ్యవహరింపబడుతున్నాయి. 'పిలుచు' ధాతువు చివరి 'చు' లోపించి 'పిలు'గాను, 'లు-'లోని హ్రస్వాచ్చు లోపించి 'పిల్చు' గాను వ్యవహారంలో వున్నాయి. కిలార్థం 'అట' విధ్యర్థంతో కలిసి వ్యవహరింపబడుతుంది. ఇది రాయలసీమలోని చాలా ప్రాంతాలలో లాగానే 'అంట'గా కనిపిస్తుంది. ఉదా : రావాలంట, వరిగొయ్యాలంట.

*చేదర్థం :*

ఇతర ప్రాంతాలలో 'ఇతే' అనే ప్రత్యయం చేరుతుంది. కాని ఇక్కడి వ్యవహారంలో 'తే' మాత్రమే ప్రత్యయంగా చేరుతుంది. ఉదా: అడుగుతే, వచ్చే- ఇక్కడ 'వచ్' ధాతువుకు 'తే' ప్రత్యయం చేరి తర్వాత వర్ణసమీకరణంవల్ల తే—చేగా మారుతుంది.

*తుమర్థం :*

తుమర్థంలో 'ఉకి' అనే ప్రత్యయం చేరుతుంది. ఉదా: సెయ్‌సేకి (చెయ్యడానికి).

*భావార్థకం :*

భావార్థంలో శిష్ట వ్యవహారంలో 'అడం' శిష్టేతర వ్యవహారంలో '-డం' చేరుతాయి. ఉదా: తినడం- తిండం, చెయ్యడం-సెయ్‌డం. కావ్యభాషలో '-ట' ప్రత్యయం చేరుతుంది. ఉదా: తినుట, చేయుట.

*వ్యతిరేకార్థకం :*

వ్యతిరేకార్థక ప్రత్యయం '-అ' చాలారూపాల్లో ఉచ్చారణలో లోపిస్తుంది. ఉదా: సెయ్‌ను, తిన్ను. భూతకాలిక వ్యతిరేకార్థాన్ని సూచించే 'లేదు' రూపం ధాతువుతో కలిసి వ్యవహరింపబడేటప్పుడు చివరి 'దు' లోపిస్తుంది. ఈలోపం శిష్ట, శిష్టేతర వ్యవహారాలు రెండింటిలోనూ వుంది. ఉదా: పోలే, రాలే, తినలే.

వ్యతిరేకార్థక అసంపూర్ణక్రియా రూపానికి 'అకుండా' అనే ప్రత్యయం చేరుతుంది. ఇది కావ్యభాషలోని 'అక' ప్రత్యయానికి బదులుగా వ్యవహరింపబడుతూంది. శిష్టేతర వ్యవహారంలో 'అకుండా' లోని 'అ' మకారాంత ధాతువుల తర్వాత నిత్యంగా, ఇతరత్ర వైకల్పికంగా లోపిస్తుంది. ఉదా : సెయ్‌కుండా, ఇనకుండా ధాతువుకు, 'అకుండా' ప్రత్యయానికి మధ్య 'కో' అనే అక్షరం అధికంగా వచ్చిన రూపాలు కూడా ఎక్కువగా వ్యవహారంలో వున్నాయి. 'కో'లోని దీర్ఘాచ్చుతో యోగంవల్ల తరువాతి 'అకుండా' ప్రత్యయంలోని హ్రస్వాచ్చు 'అ' లోపిస్తుంది. ఉదా. సెయ్‌కోకుండా, ఇనొక్కకుండా/ఇనకోకుండా.

*నిషేధార్థకం :*

నిషేధార్థక ప్రత్యయంగా 'అకు', గాకు' అనే రూపాలు వున్నాయి. ఉదా: సెయ్యాకు, సెయ్‌గాకు, రాగాకు.

## 3. సంధిలో మార్పులు

పరస్వరాదేశం తెలుగులో సంధి లక్షణం. ఈ మాండలిక వ్యవహారంలో కొన్ని రూపాలలో పూర్వ రూప సంధి కనిపిస్తుంది.

ఉదా: ఏంది + అబ్బీ = ఏందిబ్బీ
వద్దు + అమ్మా = వద్దుమ్మా
వచ్చా + ఉండా = వచ్చాండా

మీ + ఇల్లు — ఈ సందర్భంలో యడాగమం రావాలి. కాని పూర్వరూప సంధి జరిగి 'మీల్లు' అనే రూపం వ్యవహారంలో వుంది.

*ప్రథమాక్షర శేషం:-*

కొన్ని పదాలలో ప్రథమాక్షరం మాత్రం మిగిలి తక్కిన అక్షరాలు లోపిస్తాయి. ఈ లోపం ఉత్తర పదం పరమయ్యేటప్పుడు మాత్రమే జరుగుతుంది. లోప దీర్ఘత కనిపిస్తుంది.

ఉదా: బువ్వ + తిను = బూదిను
నువ్వు + రా = నూ రా
రవ్వంత + చేపు = రోంచేపు— ఈ రూపంలో 'ర' లోని హ్రస్వాచ్చు 'అ'—'ఓ' గా మారింది.

అనుస్వారం నిలిచివుంది. ఇలాగే సంధిగత రూపాలలో తరగతి = తర్తి/త్రి గాను, ఇయ్యాల = ఈల్ గాను కనిపిస్తున్నాయి.

ఉదా: ఒకటో + తరగతి = ఒకటోతర్తి/ఒకటోత్రి, ఇయ్యాల + దాంకా = ఈల్దాంకా

*ఉపసంహారం :*

పైన చర్చించిన విషయాలు ఈ జిల్లాకు మాత్రమే పరిమితమని గానీ, ఈ జిల్లానుండే ఇతర ప్రాంతాలకు వ్యాపించినాయని గానీ చెప్పడానికి వీలు లేదు. ఒక ప్రాంతంలో భాషలో కన్పించే మార్పు ఇతర ప్రాంతాలలో కూడా అదే కాలంలో గాని, ముందు లేక తర్వాతి కాలాలలో గాని సమాంతరంగా (Parallel) జరగడానికి అవకాశముంది. కొన్ని మార్పులను ఆధారంగా చేసుకొని మనం కొన్ని సూత్రాలను తయారు చేయవచ్చు. ఇవి కేవలం ఉచ్చారణ అలవాట్లను దృష్టిలో వుంచుకొని ఏర్పరచే వర్ణనాత్మక సూత్రాలు. ఈ సూత్రాలు వాటిని గురించి పట్టించుకోని భాషా వ్యవహారాలను నియంత్రించలేవు.

ఆధారాలు

(1) నాగభూషణరావు, కల్లూరు; రాయలసీమ మాండలికం— అనంతపురం ప్రాంతీయత., డి. ఎల్ ఎ ప్రచురణ
(2) కృష్ణమూర్తి, భద్రిరాజు; 'తెలుగు మాండలికాలు-ప్రమాణ భాష' 'తెలుగుభాషా చరిత్ర' నుండి ఆం. ప్ర, సాహిత్య అకాడమీ ప్రచురణ. 1979.
(3) Harry Hoijer, 'Linguistic and cultural change', in Language in culture and Society. Ed Dell. Hymes. 1964.

జూనియర్ రీసెర్చ్ ఫెలో (యు.జి.సి.),
ఆంధ్రశాఖ,
శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం,
అనంతపురం.

# ప్రియదర్శిక

## (శ్రీహర్ష రచితము)

అనువాదము : కాకరపర్తి ముఖలింగ

### —: తృతీయాంకము :—

(అంతట మనోరమ ప్రవేశించును)

మనో: దేవి వాసవదత్త 'చెలీ! మనోరమా! సాంకృత్యాయనిచే ఆర్యపుత్రుని చరిత్రము నా చరిత్రము నాటకోపనిబద్ధమైనది. అందులో మిగిలినది మీచే కౌముదీ మహోత్సవమున నటింపబడవలయునని నన్నాజ్ఞాపించినది. నిన్న ఆరణ్యిక-శూన్య హృదయయై అన్యథా అభినయించినది. ఇప్పుడు వాసవదత్త వేషము ధరించి ఆ విధముగ నటించినచో దేవికి కోపము వచ్చును. ఇప్పుడామె నెక్కడ చూడగలను? (చూచి) ఇదిగో ఆరణ్యిక తనలోనే యేమియో ఆలోచించుకొనుచు దిగుడుబావి యొడ్డునందలి కదళీగృహమును ప్రవేశించుచున్నది. కావున పొద మాటున నుండి ఈమె అనుచున్న మాటలు విందును.

(అంతట ఆరణ్యిక ప్రవేశించును)

ఆర: (నిట్టూర్చి) హృదయమా! దుర్లభజనుని ప్రార్థించుచు, నీవు నన్నే దుఃఖింపజేయుచున్నావు?

మనో: అదియా! ఈ శూన్యహృదయత్వమునకు కారణము! ఈమె ఏమి ప్రార్థించుచున్నది? శ్రద్ధతో విందును గాక!

ఆర: (కన్నీటితో) అంతటి సౌమ్యదర్శనుడైన యీ మహారాజు నన్నీ విధముగ ఎట్లు సంతాపింప జేయగలుగుచున్నాడు? ఇది నా దౌర్భాగ్యమే యేమో. మహారాజు దోషము కాకపోవచ్చు.

మనో: (కన్నీటితో) మహారాజే ఈమెకు ప్రార్థనీయుడా? బాగు, ప్రియసఖీ! బాగు! అభిజన సదృశమే నీ యభిలాష.

ఆర: ఇప్పుడెవరికి వృత్తాంతమును చెప్పి నా యీ దుఃఖవేదనను తగ్గించుకొందును? హృదయనిర్విశేష ప్రియసఖి మనోరమ యుండనే యున్నది కదా. ఆమెకు కూడ దీనిని సిగ్గుతో చెప్పలేనేమో. అన్ని విధాల ఒక్క మరణము తప్పించి నా హృదయమునకు సుఖమెక్కడిది?

మ: అయ్యో! అయ్యో! ఈ తపస్విని యనురాగము హద్దులు దాటినది కదా. ఇప్పుడేమి చేయుదును?

ఆర : (సాభిలాషముగ) ఆ ప్రదేశమే ఇది! ఇచ్చటనే దుందుడుకు తుమ్మెదలచే బాధింపబడి, మహారాజుచే అవలంబింపఁబడి 'భీరు విషాదము స్వీడుపు' మని యోదార్పబడితిని.

మనో : (సహర్షముగ) ఏమీ! ఈమె మహారాజుచే చూడఁబడినదా? సర్వధా ఈమె జీవించు నుపాయమున్నట్లే. కావున నీమెను సమీపించి ఓదార్తును (తొందరగ సమీపించి) హృదయము దగ్గర కూడ సిగ్గుపడుట తగునా?

ఆర : (సిగ్గు నటించుచు) (తనలో) అయ్యో! అయ్యో! ఈమె అంతయు వినివేసినది. కావున నిప్పుడు చెప్పుటయే యుక్తము. (ప్రకాశము) (ఆమె చేతిని తన చేతిలోనికి తీసికొని) ప్రియసఖి! కోపింపకు! కోపింపకు. ఇట సిగ్గే యీ తప్పు చేయించినది.

మనో : (సహర్షముగ) సఖి! సందేహము బాలింపుము ఇది చెప్పుము. నీవు మహారాజుచే నిజముగ చూడఁబడితివా? లేదా?

ఆర॥ : (సలజ్జముగ ముఖము వాల్చి) ప్రియ సఖి అంతయు విన్నది.

మనో॥ : మహారాజుచే చూడఁబడినప్పుడే సంతాపమేల? అతఁడే నిన్ను చూచుట కిప్పుడు తొందరపడును.

ఆర॥ : సఖీజన పక్షపాతముతో ఆలోచించుచున్నావిట్లు' దేవీకుణనిగళబద్ధుఁడగు అతనియందిది యెట్లు సంభవము?

మనో॥ : (నవ్వి) చెలీ! ముద్దరాలా! కమలినీ బద్ధానురాగమయ్యు మధుకరము మాలతిని చూచి, అభినవ రసాస్వాద లంపటుమై దానిని ఆస్వాదింపదా యేమి?

ఆర॥ : జరుగుటకు వీలులేని ఈ అభిప్రాయముతో నేమి ప్రయోజనము? నా అంగములు మిక్కిలి శరదాతప సంతప్తములై సంతాపమును వీడకున్నవి.

మనో॥ : ఓసి, సిగ్గరీ! ఇట్టి యవస్థ పొందియు నిన్ను నీవు ఇట్లు కష్టపుచ్చుకొనుట యుక్తము కాదు, శ్వాస నెపమున రేయింబవళ్ళు నీ యనురాగము వెలువడుచున్నది. అది ఎడతెగక పడుచున్న మార శర శతముల హుంకార శబ్దము వలెనున్నది. (తనలో) ఇది ఈమెను నిందించుటకు తగిన కాలము కాదేమో. ఆ తామరాకుల నీమె హృదయమున నుంచెదను. (లేచి దీర్ఘికనుండి తామరాకులు తెచ్చి ఆరణ్యకా హృదయమున నుంచును.) (ప్రకాశము) చెలీ! ఊరడిల్లు మూరడిల్లుము.

(విదూషకుడు ప్రవేశించి)

విదూ॥ : వయస్యునకు ఆరణ్యకపై అనురాగము అతి తీవ్రముగ నున్నది. దానిచే సర్వరాజకార్యములు విడచి ఆమెదర్శనోపాయమునే చింతించుచు ఆత్మను వినోదింప చేయుచున్నాడు. తననుతాను మరచుచున్నాడు. (ఆలోచించి) ఆమె నెక్కడ చూడగలను? అక్కడే ఆదీర్ఘిక దగ్గరే వెదుకనా? (అని తిరుగుచున్నాడు)

మనో॥ : ఇచ్చటే పదధ్వని వినిపించుచున్నది. కావున నీ అరటి పొదల మాటున నుండి చూతము.

(ఇరువురు పొదల మాటున దాగి చూచుచున్నారు.)

అర॥ : ఏమీ! ఇతడే- ఆ మహారాజ పార్శ్వవర్తి యగు బ్రాహ్మణుడే ఇతడు.

మనో॥ : (చూచి) వసంతకుడా ఏమి? (సహర్షము, స్వగతము) అట్లయి యుండవచ్చును.

విదూ॥ : (దిక్కులు చూచి) ఇప్పుడు నిజముగా అరణ్యిక అరణ్యిక యైనదా ఏమి?

మనో॥ : రాజస్నేహితుడు కదా ఆ బ్రాహ్మణుడు! నీ గురించి ఏదియో ఆలోచించుచున్నాడు. రమ్ము. విందము.

అర : (సస్పృహముగ, సలజ్జముగ వినుచున్నది)

విదూ॥ : (సోద్వేగముగ) మదన సంతాపము నోర్వలేని ప్రియమిత్రుని మాట ప్రకారము వాసవదత్త ప్రేమావతి మొదలగు రాణుల భవనము లన్నియు వెదకితిని కాని ఆమె కనిపింపలేదు. తరువాత ఇక్కడ కూడ చూతమని వచ్చితిని. ఇచ్చట కూడ నామె లేదు, ఏమి చేయుదును?

మనో॥ : ప్రియసఖీ! వింటివా?

విదూ॥ : (ఆలోచించి) నా ప్రియమిత్రుడు నాతో "ఒకవేళ నీ కామె కనబడక పోయినచో, ఆమె కరతల స్పర్శ సుఖ శీతలములయిన తామరాకులను పట్టికొని రమ్ము"నిచెప్పెను కదా! ఆ ఆకులను మాత్రము ఎట్లు తెలిసికోగలను?

మనో॥ : (విదూషకుని చేయి తన చేతి లోనికి తీసికొని) వసంతక ! రమ్ము. నేను జ్ఞాపకము చేయుదును.

విదూ॥ : (భయముతో) ఎవరికి నీవు జ్ఞాపకము చేయుదువు? దేవి గారికా? నేనేమియు పలుకలేదే!

మనో॥ : వసంతక! చాలించు నీ సందేహము! ఆరణ్యిక వలన నీ ప్రియ వయస్యుడెట్టి యవస్థల నందుచున్నాడని వర్ణించితివో, అంతకంటె రెండు రెట్లు మీ రాజు వలన నా ప్రియసఖి అవస్థ పడుచున్నది. కావున దగ్గరకు వచ్చి చూడుము. ఇటు చూడు. (సమీపించి ఆరణ్యికను చూపును)

విదూ॥ : (సతోషముతో) నా పరిశ్రమ ఫలించినది. పూజ్యురాలికి శుభమగు గాక.

అర॥ : (సలజ్జముగ తామరాకులం దీసివేయుచున్నది)

మనో॥ : (సస్మితముగ) ఆర్య! వసంతక! నీ దర్శనము చేతనే ప్రియసఖి సంతాపము తొలగినది. ఎందుకనగా- స్వయముగా తానే తామరాకులను తొలగించుకొనుచున్నది కావున ఆర్యుడీ తామరాకులను స్వీకరించు గాక!

అర॥ : (సావేగముగ) ఓసీ! పరిహాస శీలా! నన్నేల సిగ్గులంజేయుచున్నావు? (కొంచెము పెద మొగము పెట్టియుంచును)

విదూ॥ : (సవిషాదముగ) ఆ తామరాకులుంచసీ. నీ ప్రియసఖి మిక్కిలి లజ్జావతి. ఎట్లు వీరి సమాగమము జరుగునో కదా!

మనో॥ : (క్షణకాలమాలోచించి సహర్షముగ) వసన్తక ! ఇట్లు (చెవిలో చెప్పుచున్నది)

విదూ॥ : బాగు! ప్రియసఖీ బాగు: (అపవారించి) మీరు వేషములు వేసి అలంకరించుకొను లోపల నేనుకూడ వయస్యుని తీసికొని వచ్చెదను. (నిష్క్రమించును)

మనో॥ : ఓ కోపిష్ఠిదానా ! లెమ్ము లెమ్ము. ఆ నాటకములో మిగిలినది మనము ఆడిన

యింపవలెనుగద. కావున రమ్మ. నాట్య
శాలకే వెళ్ళుదము (తిరిగి) అదుగో నాట్య
శాల ! రమ్మ ప్రవేశింతము (ప్రవేశించి
చూచి) చక్కగా అలంకరింపబడినది ఇక
దేవి వచ్చుటయే తరువాయి.

(పిమ్మట దేవియు, సాంకృత్యాయనియు, తగిన పరివారము ప్రవేశింతురు)

వాస॥. భగవతి! మీ కవిత్వమెంత యద్భుతముగ నున్నది ! ఏలనన! నాటకముగా కూర్పబడిన యీ వృత్తాంతము మాకు సానుభవమయ్యు ఆర్యపుత్ర చరిత్ర అదృష్టపూర్వమువలె దృశ్యమానమై మిక్కిలి కుతూహలమును వృద్ధిపొందించుచున్నది.

సాంకృ॥: ఆయుష్మతి ! ఆశ్రయగుణమే యిట్టిదికద! ఒకవేళ కావ్యమనుదారముగనున్నను, శ్రవణసుఖము కలిగించుచున్నదనిపించువు గాక. చూడు.

గీ॥ తలచుగా నెంతయో కొంత ధరణియందు
నందు నుత్కర్ష మహదాశ్రయంబు వలన
అదియు భస్మమెయో గాక మదపుటేన్గ
కుంభమున్జేర శృంగార గుణము కొందు.

వాస॥: (చిరునవ్వుతో) ఎల్లరకు జామాత (వత్సరాజు) ఇష్టుడనియే తెలియుచున్నది. కావున కథానుబంధనముతో నేమిపని? నటించుచుండగా చూచుటయే లెస్సగ నుండును.

సాంకృ॥: ఆగుము ఇందీవరికా! నాట్యశాలచూపుము.

చేటి:- ఇటురమ్మ భట్టినీ! ఇటురమ్మ.
ఎల్లరు నడచుచున్నారు)

సాంకృ॥: (చూచి) ఆహా! ఈ ప్రేక్షాగృహమెంత ప్రేక్షణీయము!

గీ॥ మణులు తాపిన శాతకుంభంపు స్తంభ
ములను ముత్తెపు పేరులు పొసగ-నవ్వ
రసలను మించెడు రమణుల-రమ్య నాట్య
మందిరం బిద్ది దేవవిమాన సమము !

(మనోరమయు, ఆరణ్యికయు సమీపించి)

మనో॥ ఆర॥: భట్టినీ ! జయమగుగాక !

వాస॥: మనోరమా! సంధ్య అతిక్రమించెనుగదా! కావున వెళ్ళి తొందరగ అలంకరించికొని రండు.

మనో॥,ఆర॥: భట్టిని యాజ్ఞాపించినట్లే.

వాస॥: ఆరణ్యికా, నా అంగములందు ధరించిన నగలతోనే అలంకరించుకొనుము. (ఆభరణములు తీసిఇచ్చును) మనోరమా! నీవు మాత్రము నలగిరియను నేనుగును పట్టుకొనగా సంతసించి ఆర్యపుత్రులకు నాన్నగారిచ్చిన ఆభరణములను ఇందీవరికనుండి పుచ్చుకొని నేపథ్యములో అలంకరించుకొనుము.

ఇందీ॥: భట్టినీ! ఇదిగో ఆసనము. కూర్చుండుము.

వాస॥: (ఆసనమును చూపి) భగవతీ కూర్చొనుము.
(ఇరువురు నాసనములపై కూర్చుందురు)

(పిమ్మట వేషము వేసుకొని కంచుకి ప్రవేశించును)

కంచు: గీ॥ అంతిపురముల కట్టడ లన్నిచేసి
మాటి మాటికి పొరపాట్లు మాన్పజేసి
నేను జరచేత నీ దండసితిబూని
రాజవృత్తానుకారినై రాజిలుదును.

అశేషశత్రుసైన్యము నవమానించి యథార్థనాముడైన మహాసేనునిచే, "రేపు మేము ఉదయన మహోత్సవము ననుభవింతుము. ఇందుచే మీరెల్లరు ఉత్సాహానురూప వేషోజ్జ్వలమగు పరిజనముతో పాటు మన్మథో

ద్వారమునకు రమ్మని అంతఃపుర జనమున
కాజ్ఞాపింపబడినది.

సాంకృ॥ : (కంచుకిని చూపి) నాటకము ప్రారంభ
మయినది. చూడుము.

కంచు : అందుచే పరిజనమును వెళ్ళుమనియే ఆదే
శింపవచ్చును. అలంకరించుకొని రమ్మని
చెప్పనక్కరలేదు ఏలనన

శు॥సీ॥ పదములందెల తోడ బాసిల్ల జఘనముల్
కాంచీగుణంబుల గల్లురనగ
గబ్బిగుబ్బల హార కాంతులు తొలుకాడ,
బాహు పుషల్లు బాహుళలర
కర్ణ వేష్టనములఁ గర్ణంబు లొప్పగా
కరముల వలయముల్ మెరయుచుండ
స్వస్తిరాయుత కేశపాశంబుతో దేవి
పరివారమిటుఁ గానఁబడగనయ్యె.

ఇచట క్రొత్తగా చేయవలసిన దేమియు
లేదు. కేవలము స్వామి యాజ్ఞ యని
తలచి తదాజ్ఞాశేషమును రాజపుత్రికకు
నివేదింతును. (పరిక్రమించి చూచి)
ఈమెయే వాసవదత్త. వీణా హస్తయగు
కాంచనమాల తోడురాగా గాంధర్వశాల
యందు ప్రవేశించుచున్నది. ఈమెకే
చెప్పెదను.

(పిమ్మట వాసవదత్తా వేషము ధరించిన
ఆరణ్యకయు వీణాహస్తయగు కాంచన
మాలయు ప్రవేశింతురు)

ఆర॥ : చెలీ! కాంచనమాలా! వీణాచార్యుడేల
నాలస్యము చేయుచున్నాడు?

కాంచ॥ : భర్తృదారికా! అతడొక యున్మత్తుని
గాంచినాడు. అతని పల్కులు విని
దానిచే జరుగు ఫలితములు తలచుకొని
నవ్వుచు నిలుచున్నాడు.

ఆర॥ : (చేతులతో చప్పట్లు చరచుచు నవ్వి)
సమానులు సమానులను చూచి ఆనం
దింతురని చెప్పుట సమంజసమే సుమీ!

సాంకృ॥ : రాజపుత్రి, అచ్చు నీ యాకారమును
బోలిన యాకారము తోనే నివేషమును
పోషించినది.

కంచు॥ : (సమీపించి) రాజపుత్రి! రాజుగారు
మిమ్ముల రేపు తప్పక మేము మీ వీణా
వాదనము వినవలయును. కావున
తంత్రీ సన్నద్ధమగు ఘోషవతితో
నుండవలసినదని యాజ్ఞాపించిరి

ఆర॥ అట్లే అయినచో వీణాచార్యుని
పంపుము.

కంచు॥ వత్సరాజును పంపింతును. (నిష్క్ర
మించును)

ఆర॥ : కాంచనమాలా! ఘోషవతిని తెమ్ము.
ఇంతలో దానితంత్రులను పరీక్షింతును.

(కాంచనమాల వీణ నిచ్చును)

(పిమ్మట వత్సరాజు వేషము ధరించిన మనోరమ
ప్రవేశము)

మనో॥ : (తనలో) మహారాజు ఆలస్యము చేయు
చున్నాడు. వసంతకుడు చెప్పలేదా?
(పిమ్మట శరీరము కప్పుకొని రాజును
విదూషకుడును ప్రవేశింతురు)

రాజు : శు॥సీ॥ తాపంబు కలిగింపఁ దలపడు
చంద్రుండు
పూర్వపురీతి నిప్పుడును నాకు
వేడి నిట్టూర్పులు వెడలి యజస్రంబు
నధరంబుపై దాడి కరుగలేదు
మనసు శూన్యంబుగా తనరదిప్పుడు
నాదు
సంగంబు లలసత నొందబోవు
కోరికల్దలంపులో తూడిన యంత్రనే
దుఃఖము కృశమౌటఁ దోచుచుండె

వయస్యా ! మనోరమ సత్యమే వచిం చెనా? "నాయీ ప్రియసఖి మహారాజు కంటఁబడకుండ దేవిచే రక్షింపబడు చున్నది. కావున సమాగమోపాయమిది ఈ రాత్రి మాచే ఉదయన నాటకము దేవియెదుట నటింపబడును. ఇప్పుడా రణ్యక వాసవదత్త కాగలదు. నేనేమో వత్సరాజునగుదును. అతని నడువడి తోనే సర్వము నేర్చుకోవచ్చును. కావున స్వయముగా వచ్చి స్వీయ భూమిక నెరవేర్చుచు సమాగమ సుఖము ననుభవింపుమవు గాక", అనియేకదా మనోరమ చెప్పినది !

విదూ ॥ : ఒకవేళ నన్ను నీవు నమ్మనిచో ఇదిగో ఈ మనోరమ నీ వేషము ధరించి ఇట నున్నది. ఆమె దగ్గరకు వెళ్ళి స్వయ ముగా అడుగుము.

రాజు : (మనోరమనుచేరి) మనోరమా! వసంత కుడు సత్యమే వచించెనా?

మనో : ప్రభూ! సత్యమే! ఈ ఆభరణములచే మిమ్ముల నలంకరించు కొనుడు. (ఆభరణములను తీసిఇచ్చును)

రాజు (ధరించును.)

విదూ వీరేకదా రాజులు! దాసీజనము కూడ వీరిని ఆడించుచున్నదే ఓహో! కార్యము యొక్క గురుత్వము!

రాజు (నవ్వి) ఇది పరిహాసమునకు సమ యమా ఏమి? వినయముగా చిత్ర శాలను ప్రవేశించి మనోరమతో కూడ మా నృత్తమును చూచుచు కూర్చుం డుము.

విదూ॥: (అట్లే చేయును)

ఆర॥ : కాంచనమాలా! వీణ ఉండనీ! నిన్నాత టమగుఁ దలఁచుచున్నాను.

రాజు॥: ఏందును గాక! ఇప్పుడామె ఏ యుద్దేశ ములో నున్నదో తెలియగరాదు.

కాంచ : భర్తృదారికా ! అడుగుము.

ఆర॥ : వత్సరాజు వీణ వాయించుచు తన నాకంద పరచినచో విడిచిపెట్టెదనని నిజముగా నాన్నగారు ఆలోచించు చున్నారా?

రాజు:- (పటాక్షేపముతో (ప్రవేశించి) వస్త్రాం తమందు గూఢముగ బంధించును) ఇది ఇట్లే సందేహమేమి?

గీ॥ వీణవాయించి ప్రద్యోత పృథ్వీపతిని
సపరిజను విస్మయంబున సరగ ముంచి
యపహరింతును దత్సుత నచిరకాల
మందె వాసవదత్త నియ్యది నిజంబు!

ఏలనన, యౌగంధరాయణుడు సర్వము సిద్ధపర చియే యున్నాడు.

వాస:- (వేగముగ లేచి) ఆర్యపుత్రునకు జయ మగు గాక !

రాజు:- (తనలో) దేవిచే పోల్చఁబడితినా యేమి?

సాంకృ:- సంభ్రమము చాలును. ఇది నాటకము.

రాజు - (ఆత్మగతము) (సంతోషముగ) ఇప్పుడు తేరుకొంటిని:

వాస:- (సవిలక్ష స్మితముగా కూర్చొని) ఏమి! మనోరమయే కదా ఈమె! నేను ఆర్య పుత్రుడనియే తలచితిని. సాధు! మనో రమా! సాధు! చక్కగా నటించితివి!

సాంకృ:- మనోరమ భ్రమింప జేయుటకు తగి యున్నది.

క॥ సీ॥ కన్నుల విందగు కమనీయ మౌ రూప
మదె వేష, ముజ్జ్వల మదియె సుమ్ము
మత్తగజోచిత మహనీయ గతియదె
ఆత్మార్జితంబు విద్యదియె సత్త్వ,
మదేలీల! అదెనాద. మంబుజ గర్జన
ననుకరించుచు నుండె- నతిప తాను
వత్సరాజై ఇట ప్రత్యక్ష మయ్యెను
ఎంతయు నేర్పుతో నిటుల మనకు

వాస:- సఖీ! ఇందీవరిక! బంధితుడైన ఆర్యపుత్రునిచే నేర్పబడితిని. కనుక ఈ నల్ల కల్వల దండతో కట్టుము. (అని శిరసు నుండి నల్ల కలువ పూల దండ తీసి యిచ్చును.)

ఇందీ॥ : (ఆ విధముగనే చేసి మరల కూర్చున్నది)

ఆర॥ : కాంచనమాలా! ఇది చెప్పుము. వీణను వాయించుచు వత్సరాజు నన్ను ఆనంద పరచినచో తప్పక బంధనము నుండి విడిపింతునని నాన్నగారు నిజముగ ఆలోచించినారా?

కాంచ॥ : భర్తృదారికా! సత్యమే. వత్సరాజునకు నీవెట్లు ఇష్టపడుదువో అట్లే సంచరింపుము.

రాజు : మేము చెప్పవలసినది కాంచనమాలయే చెప్పెను.

వాస : అట్లైనచో ఆదరముతో వాయింతును.

కం॥ ఘనబంధన సంబద్ధ గ
గనమును వాయించగాంచి, కామినిఁ గాంచన్
తన మానస వసతికిఁ గై
కొన నుత్సాహంబుఁ జూపఁ గోరుచు నుండెన్.

(వీణ వాయించును)

విదూ॥ : (నిద్ర నటించును)

మనో॥ : (చేతితో కదుల్చుచు) వసంతక! చూడు, చూడు నా ప్రియసఖి అభినయము చేయుచున్నది.

విదూ॥ : తొత్తుకూతురా! నీవు కూడ నన్ను నిద్ర పోనీయవా ఏమి? ఏనాడు నా ప్రియ వయస్యుడు ఆరణ్యకను చూచెనో, ఆనాటి నుండి అతనితో పాటు నాకును నిద్రదూరమైనది. కావున నేను పోయి నిద్రించెదను. (నిష్క్రమించి పరుండును)

ఆర : (మరల పాడును)

గీ॥ అభినవంబైన రాగమునంది యతని
గాఢమౌ కోర్కె మదిలోనఁ గలిగి యుండె
దయితు ప్రియదర్శనుం జూడఁ దలచి మిగుల
తహతహఁ బొందియున్నది తరుణి యిపుడు.

రాజు : (దానిని విని వెంటనే హఠాత్తుగా) (చేరి) బాగు రాజపుత్రీ! బాగు! ఏమి పాట! ఏమి వాదనము!

సీ॥ దశ విధ వ్యంజన ధాతువు ప్రకటించె
వీణ వాయించుచు వెలది యిచట
ద్రుత మధ్య లంబిత రూప పరిచ్ఛిన్న
లయ మాత్రలంగుల రమ్యమయ్యె
క్రమముగా గోపుచ్ఛ ప్రముఖాది యతులెల్ల
సంపాదితంబులై సాగె భళిర!
వాద్యవిధాలు తత్త్వౌఘాను గతములు
త్రయము చక్కఁగఁ జూపె తరుణి లెస్స.

ఆర॥:- (వీణను విడిచి ఆసనము నుండి లేచి రాజును సాభిలాషముగఁ జూచుచు)

ఉపాధ్యాయునకు నమస్కారము !

రాజు:- (సస్మితముగ) నేనేది కోరుచుంటినో నీకది అనుగాక!

కాంచ:- (అరణ్యిక యొక్క ఆసనమును చూపి) ఇచ్చట ఉపాధ్యాయులు కూర్చొనుదురు.

రాజు:- (కూర్చొని) రాజకుమారి ఇపుడెచ్చట కూర్చుండును.

కాంచ:- (సస్మితముగ) ఇప్పుడే భర్తృదారిక విద్యా గుణములను మీరు మెచ్చుకొనిరి. కావున ఉపాధ్యాయ పీఠమున నధిష్ఠించుటకు తగియే యున్నది. రాజపుత్రీ! కూర్చొనుము.

(అరణ్యిక కాంచన మాలను చూచును)

కాంచ:- భర్తృదారికా! ఇందేమి దోషమున్నది? నీవు శిష్య విశేషవు కదా! (అరణ్యిక సభయముగ కూర్చొనుచున్నది.

వాస:- (సలజ్జముగ) భగవతి! అధికముగ కావ్యము కల్పింపబడినది. నేనాకాలము నందు ఏకాసనమున ఆర్యపుత్రునితో కూర్చొనలేదు.

రాజు:- రాజపుత్రీ! మరల వినగోరుచున్నాను. వీణ వాయించుము.

అర:- కాంచనమాలా! చాలసేపటినుండి వీణ వాయించుచున్న నాకు అలసట కలిగినది. ఇప్పుడు నా యవయవములు ఓర్చుకొనలేవు కావున వాయింపలేను.

కాంచ॥ : ఉపాధ్యాయ! భర్తృదారిక మిక్కిలి అలసినది. చెక్కిళ్ళయందు చెమట బిందువులు పట్టినవి. ఈమె అరచేతులింకను వణకుచునే యున్నవి. కావున ముహూర్తకాలము ఈమె సమాశ్వసింపబడుగాక!

రాజు॥ : కాంచనమాలా! చక్కగా చెప్పితివి! (తన చేతిలోనికి తీసుకొనబోవును)

అర : (చేతిని తొలగించును)

వాస : (సాసూయముగ) భగవతి! జరిగిన దానికంటె నెక్కువగ రచింపబడినది. నేను కాంచనమాలా కావ్యముచే వంచింపబడవలసినదానను కానుకద!

సాంకృ : (నవ్వి) ఆయుష్మతి! కావ్య మిట్టిదిగనే యుండును.

అర : (కోపించినదానివలె) కాంచనమాలా! నాచే గౌరవింపబడదగినదానవు కావని యెఱుంగుము.

కాంచ : (సస్మితముగ) నేనచ్చటనుండి గౌరవింపబడనిచో- ఇచ్చట నుండనే యుండను. పోయెదను. (నిష్క్రమించును)

అర : (ససంభ్రమముగ) కాంచనమాలా! ఉండుము. నా అరచేయి ఇతని చేతిలో ఉన్నది.

రాజు : (అరణ్యిక హస్తమును చేతిలోనికి తీసికొని)

చం॥ సరసిజ కోశ మెట్లహిమ సంఘముచే శిశిరత్వ మందెడిన్
నెరి నదిసంతపంబు నిదనేర; దుషస్సమయంబు నందు సుం
దరమగు లేత యెండకును దాఁడగు పంచ నఖేందు సంఘమి
త్తరి కురియించెనో హిమము? దాహియగన్గవ యిద్దియూరనే
నెరిగిరి- స్వేదమిన్మిష నిదేసుధచిందెను- వ్యక్త మయ్యెడున్.

మరియు

కం॥ ఇది బాల విద్రుమ పల్లవ
మృదుశోభ హరించునట్టి మృదుహస్తము! నా
హృదయమున దీని చేతనె
యుద వించితి రాగమెంతొ యుద్ధృత రీతిన్.

ఆర॥:- (స్పర్శవిశేషము నటించుచు) అయ్యో! అయ్యో! ఇది మనోరమము దీనిని అనుభవించుచు నా అంగములు స్మృతి తప్పుచున్నవి.

వాస॥:- (వేగముగ లేచి) భగవతి! నీవు చూడుము. నేనీ యబద్ధమును చూడ జాలను.

సాంకృ॥:- రాజపుత్రి ! ఈ గాంధర్వ వివాహము ధర్మశాస్త్ర సమ్మతమే. సిగ్గుపడవలసిన విషయమిందేమి కలదు? ఇది నాటకము. అందుచే రసభంగము చేసి చనుట యుక్తము కాదు.

వాస:- (తిరుగుచున్నది)

ఇందీ॥:- (చూచి) భట్టిని ! వసంతకుడు చిత్రశాలా ద్వారమున నిద్రించు చున్నాడు.

వాస॥:- (నిరూపించి) ఈతడు వసంతకుడే (ఆలోచించి) రాజు కూడ ఇచ్చటనే యుంటవచ్చును. కావున నితనిని లేపి యీ విషయ మడిగెదను. (లేపును)

విదూ॥:- (నిద్రాజన్య వికారమును నటించుచు లేచి తొందరగా చూచి) మనోరమా ! నటించి వయస్యుడు వచ్చినాడా? లేక ఇంకను నటించుచునే యున్నాడా?

వాస:- (సవిషాదముగ) ఏమీ! ఆర్యపుత్రుడు నటించుచున్నాడా? ఇప్పుడు మనోరమ యెక్కడ ?

విదూ:- ఆమె చిత్రశాల యందున్నది.

మనో॥:- (సభయముగ) దేవి మనస్సులో ఒకటి తలచి యడుగుచుండగా ఈ మూర్ఖ బ్రహ్మచారి వేరొకటి చెప్పి అంతయు చెడగొట్టినాడు.

వాస;- సరోషముగ నవ్వుచు) సాధు! మనోరమ సాధు ! చక్కగా నటించితివి.

మనో॥ : (భయముతో కాళ్ళపైబడి) (వణకుచు) భట్టిని ! నా తప్పేమియు ఇందులేదు. ఈ హతాశుడు బలవంతముగ అలంకారములు గ్రహించి ద్వారమందే నన్నడ్డగించినాడు. నేనెంత మొఱపెట్టినను మురజాదిధ్వనులచే ఎవ్వరికిని వినిపింపలేదు.

వాస॥ : చెలీ ? లెమ్ము! అంతయు తెలిసినది. ఆరణ్యికా వృత్తాన్త నాటక సూత్రధారుడు వసంతకుడే కద !

విదూ॥ : స్వయముగా ఆలోచింపుము. ఆరణ్యిక యెక్కడ? వసంతకు డెక్కడ?

వాస॥ : మనోరమా! ఇతనిని భద్రముగ పట్టుకొనిరమ్ము. అతని చూడదగిన నాటకము చూతము.

మనో॥ : (స్వగతము) ఇప్పుడు తేరుకొంటిని. (ప్రకాశముగ) అట్లే (విదూషకుని కంఠమున బంధించి) హతాశ ఇప్పుడు నీ దుర్ణయ ఫలము ననుభవింపుము.

వాస॥ : (ససంభ్రమముగ రాజును సమీపించి) అమంగళము నీకు ప్రతిహత మగుగాక ! (అని పాదముల మీదపడి నీలోత్పలదామమును తీసివేయు చున్నది)

అర॥ : (భయముతో చేరి నిలుచున్నది)

రాజు : (వేగముగ లేచి) (విదూషకుని, మనోరమను కూడ చూచి, తనలో) పోల్చబడితినాయేమి? (వెలవెలబోవుట నటించును)

వాస : (వెటకారముగ) ఆర్యపుత్రుడు సహించు గాక! నీవు మనోరమగా దలపబడి నల్లకలువల దండచే కట్టబడితివి.

సాంకృ : (అందరిని చూచి సస్మితముగ) ఈ నాటకము వేరొక మలుపు తిరిగినది. మావంటి వారిచ్చట నుండతగదు. (నిష్క్రమించును)

రాజు:- (తనలో) ఈ కోపపు తీరు అపూర్వముగ నున్నది. ఈమె ననునంుంచుట దుర్లభమని తోచుచున్నది. (ఆలోచించి ఇట్లు చేయుదును. (ప్రకాశముగ) దేవీ' కోపము వీడుము.

వాస:- ఆర్యపుత్ర ! ఇచట కోపించిన దెవరు?

రాజు:- ఏమీ ! కోపింప లేదా !

శు॥ సీ॥ చూపులేమో స్నిగ్ధ శోభితంబులె కాని
యధరంబు గెంజాయ లలరు చుండె
మాధుర్య మున్నను మాటి మాటికి వాక్కు
గద్గద స్వరముతో గనలు చుండె
ఊర్పులు నియతి మై నున్నను కుచభరో
త్కంపంబుచే వాని దాటి తెలిసె
ప్రకట ప్రసాదము తిరియించు గాక నీ
కోపమ్మె స్ఫుటము సూ కోమలాంగి !

ప్రియా! అనుగ్రహింపు మనుగ్రహింపుము.

వాస:-॥ అరణ్యికా ! నీవు కోపించితి వని ఆర్య పుత్రుడు బ్రతిమాలుచున్నాడు. కావున నతని యొద్దకు రమ్ము. (చేతితో లాగుచున్నది.)

అర॥:- (భయముతో) భర్త్రిని నేనేమియు నెరుగను.

వాస:- అరణ్యికా ! నీవేల యెరుగవు? ఇపుడే నిన్ను శిక్షింతును. ఈమెను పట్టుకొనుము.

విదూ:- పూజ్యురాలా! ఈ కౌముదీ మహోత్సవమున నీ చిత్తము నపహరించుటకు వయస్యుడే యీ ఘటన మాడెను.

వాస:- ఈ మీ దుర్నయము చూచి నాకు నవ్వు వచ్చుచున్నది.

రాజు:- చాలు ! నీ వికల్పము ! చూడు.

శు॥ సీ॥ కాంత! పాలేందు పై కనుబొమ ముడివేసి
తెచ్చుకొనెదవేల మచ్చ వృథగ?
గాలిచే మిక్కిలి కంపించు మంకెన
పువురీతి నధరంబు పొలుచునేల ?
గబ్బి గుబ్బల ప్రేగు కలిగించి నడుమున
కిడుములు పెట్టెదవేల యింతి !
అలుకమానుము త్వదీయాంతరంగంబు నే
నపహరింపగ నిట్టులాడినాను.
దేవీ! అనుగ్రహింపుము. అనుగ్రహింపుము.
(పాదములపై పడును)

వాస॥ : చెలీ ! నాటకము పూర్తి అయినది. పదఅంతఃపురమున కేపదము (స్త్రీలును విదూషకుడును నిష్క్రమింతురు)

రాజు : (చూచి) అనుగ్రహము చూపకయే దేవి యేగినదా ?

శు॥ సీ॥ చెమట బిందులు చాల చెవరి భీషణతర
భ్రూభంగ మొక్కటి రోషపూర్ణ,
మపరముత్ఫుల్ల మృగీవ్యాకోల నేత్రోత్ప
లము భయోద్ధూత రీతులను వహించు.
నెదుటగా నున్నట్టి యీ ప్రియ మోమును
కనుగొనుచుండగా గ్రమముగాను
ఉలికిపాటును గల్గు నుత్సుకతయు గల్గు
నిట్టి సంకటమును నెట్టింపల.

ఇక ఇప్పుడు వనకగడికే యేగి. దేవి ప్రసాదనోపాయ మును ఆలోచింతును.

(అని యెల్లరు నిష్క్రమింతురు).

-: ఇది తృతీయాంకము :-

# సాహిత్యగోష్ఠి

## వావిళ్ళ వారి వాఙ్మయోద్ధరణ

సంస్కృతాంధ్ర విజ్ఞాన దీపికలకు తొలి కర్మాగారం వావిళ్ళ వారి సంస్థ. భాషాసుందరికి ముత్యాల సరాలు దిగవేసినట్లు సొగసైన అక్షరములతో సంస్కృతాంధ్ర గ్రంథముల గూర్చినారు. మూర్తీభవించిన సంస్కృతాంధ్ర వాణీమణి యిట ముసిముసి నవ్వులతో చిందులు త్రొక్కినది. మూల చెదలచే క్రుమ్మగ్గుతున్న సంస్కృతాంధ్ర గ్రంథములను వెలికితీసి ఉద్ధరించినవారు వావిళ్ళ వారు. వావిళ్ళ వారి పుస్తకము నేటికిని ప్రతి ఇంట దర్శనమిచ్చును. ఈ వాఙ్మయోద్ధరణ మహాక్రతువులో వావిళ్ళ వారు అధ్వర్యులు కాగా పండిత ప్రకాండులు ఋత్విక్కులు. విజ్ఞాన సముద్రమును మథించి కావ్యామృత కలశములను వెలికితీసి సాహితీ లోకమున కందించిన కర్మయోగి వావిళ్ళ రామస్వామిశాస్త్రి గారు. రమారమి 9 శతాబ్దాలలోని సాహిత్యమునకు అక్షరాకృతి నిచ్చి నలువరాణికి పట్టము గట్టిన కీర్తి వావిళ్ళ వారికి దక్కినది. శతాధిక వత్సరాలలో సహస్రాధిక గ్రంథ ప్రకాశకు లయినారు.

ఆర్ష మహాతపస్వి వావిళ్ళ రామస్వామిశాస్త్రి గారు 1828 లో నెల్లూరు జిల్లా కోవూరు తాలూకా వావిళ్ళ గ్రామంలో జన్మించినారు. తండ్రి వేంకటేశ్వరశాస్త్రి. తల్లి మంగమ్మ. వీరు పుదూరు ద్రావిడ వంశమునకు చెందినవారు. వీరి పూర్వీకులు తమిళ దేశము నుండి నెల్లూరు జిల్లాలోని నాయుడుపేటకు సుమారు 2 మైళ్ళ దూరములోని పుదూరు గ్రామమున స్థిరపడినందున వీరికి పుదూరు ద్రావిడులని పేరు. ఈ వంశము వారు వేద శాస్త్ర సంగీత సాహిత్యములతో నిష్ణాతులు. పుదూరు ద్రావిడులకు నెల్లూరు జిల్లా ముఖ్య కేంద్రము.

రామస్వామిశాస్త్రి గారికి ముగ్గురు సోదరులు, ఒక సోదరి గలరు. పసితనంలో మాతృవియోగం కల్గింది. రామస్వామిశాస్త్రి గారు కనిష్ఠులు. తమ తృతీయ సోదరులు అనంత నారాయణశాస్త్రి గారితో నెల్లూరులో వేదవిద్య నభ్యసించి, సంస్కృతము చదువుటకై గోదావరి జిల్లా ద్రాక్షారామము చేరిరి. అచట వ్యాకరణ శాస్త్రము చదివి మద్రాసు లోని తంజావూరి రామానాయుడు గారి సంస్కృత పాఠశాలలో సంస్కృత సాహిత్య జ్ఞాన మలవరచుకొనిరి. తర్వాత మైసూరు రాజావారి సంస్కృత పాఠశాలలో సంస్కృత కన్నడములతో రామాయణ, భారతాదుల ప్రచురించిరి. తగిన ప్రోత్సాహము లేకపోవుటచే దానిని మాని రాజా గారి సంస్కృత పాఠశాలలో అధ్యాపక వృత్తి నవలంబించిరి. వారచట ఉండు రోజులలో శృంగేరి పీఠాధిపతులతో పరిచయ మేర్పడి వారిచ్చిన రు 500/- లతో మద్రాసు చేరి అన్నదమ్ము లిరువురు మామ గారైన వేదం వేంకటాచలశాస్త్రి గారితో వివేకరత్నాకరమను ముద్రాక్షరశాల నెలకొల్పిరి. దీనిని సాగించుచూ 'హిందూ భాషా సంజీవని' 'సరస్వతీ ముద్రాక్షర శాల'ను భాగస్వామ్యంతో నడపిరి. కాని చివరికి

తమ గృహమునందే సొంతముగ 'ఆది సరస్వతీనిలయ' మను ముద్రణాలయమును 1854 లో నెలకొల్పి సంస్కృతాంధ్ర గ్రంథముల ప్రచురించుచుండిరి. శాస్త్రి గారు ముద్రాపకుడుగా, వ్యాఖ్యాతగా, రచయితగా ప్రసిద్ధులు. వీరిని గ్రంథప్రకాశన పితామహు లన వచ్చును. లండన్ నగరములోని బ్రిటిష్ మ్యూజియం వారు 1878 లో ఇండియాలోని గ్రంథములజాబితాను ప్రకటించు సమయమున వావిళ్ళ వారి గ్రంథముల జాబితాను ప్రకటించిరి. ఇందు 17 విశిష్ట సంస్కృత గ్రంథముల పేర్కొనిరి.

శాస్త్రిగారు మారుమూలలోని తాళగ్రంథములకు మరియు మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయములోని గ్రంధములకు శుద్ధప్రతుల తయారుచేయించి అచ్చు వేయుంచిరి. పాఠాంతరములు పరిశీలించి అచ్చు వేయుటలో వారు జూపిన శ్రద్ధ గొప్పది. సి పి. బ్రౌను పాఠ నిర్ణయ విధానమును చక్కగా జీర్ణించుకొన్న శాస్త్రి గారు బ్రౌనుగారి ఆశయాలను గ్రంధరూపములో సాక్షాత్కరింప జేశారు.

శాస్త్రిగారు సంస్కృతాంధ్రములలో చక్కని వైదుష్యం గలవారు. వ్యాపారదృష్టి వీడి హిందూ ధర్మోద్ధరణమును లక్ష్యముగా పెట్టుకొని భారతీయ సంస్కృతికి మణిదర్పణమగు ప్రాచీన గ్రంథముల ప్రచురించుటయే శాస్త్రిగారి ధ్యేయము. మద్రాసులో శృంగేరి వారి ప్రతినిధులుగ నుండి శాస్త్రచర్చలు మతోపన్యాసములు నడుపుచుండిరి.

సంస్కృతము నభ్యసించువారికి మొదటకావలసిన అమరకోశము, శబ్దమంజరి, బాల రామాయణములను ప్రకటించుచు వాటితోబాటు బృహత్తరమయిన రామాయణ, మహాభారత, భాగవతాదుల తెలుగు లిపిలో ముద్రించిరి. శ్రీమద్వాల్మీకి రామాయణమును విశేషార్థములతో ఆంధ్ర వ్యాఖ్యానమును సంచికలరూపమున చందాదారుల సహాయముతో ప్రకటించిరి. ఇట్టి చందాదారులలో వెంకటగిరి ప్రభువులు, బుచ్చి వాస్తవ్యులు పుట్టా కోదండరామిరెడ్డి గారు, మోపూరు వాస్తవ్యులు రేబాల పట్టాభిరామిరెడ్డి గారు ముఖ్యులు. శాస్త్రిగారి జీవిత కాలములో ఇది పూర్తి కాలేదు. అల్లుడు శ్రీ చదలవాడ సుందరరామశాస్త్రి గారు కొరవ రామాయణమును పూర్తి చేసిరి. రామాయణ, భారత, భాగవతములను దేవనాగరలిపిలో ముద్రించి వెలువరించిరి. అందు మహాభారత, రామాయణములకు మద్రాసు పౌరులు గజారోహణోత్సవము జరిపిరి.

ఉత్తర భారతములో హిందీ సంస్కృతములకు చౌకాంబా, గీతాది ముద్రాక్షరశాలలు నేడు ఎట్లు సేవ చేయుచున్నారో అట్లే సంస్కృతాంధ్రములకు దక్షిణ భారతమున వావిళ్ళవారు ఎనలేని సేవ చేసినారని చెప్పవచ్చును.

శాస్త్రిగారు వివిధ వ్యాఖ్యల సహాయముతో స్వయముగా మనుచరిత్ర, ఆముక్తమాల్యదలకు 'రుచి' యనుపేర వ్యాఖ్య వ్రాసి ప్రకటించిరి. పైగ్రంథములే గాక రామానుజసూరి గారిచే పరిష్కరింపబడిన అప్పకవీయము తదుపరి అష్టోత్తరశతోపనిషత్తులు, భాస్కరాచార్యుని లీలావతి గణితము, సంస్కృతవిష్ణు పురాణము, వర్ణాశ్రమ ధర్మకాండ, యజుర్వేదభాష్యం విశ్వకోశం, హారావళి అను గ్రంథములు తమ పర్యవేక్షణలో ముద్రించిరి. మిగిలిన గ్రంథములు పండిత పర్యవేక్షణలో ప్రకటితములు. ఇట్లు వైదిక, పురాణ, సాహిత్య గ్రంథములు కొంతమేరకు ప్రకటించి 1891 లో శాస్త్రిగారు దివంగతులయిరి. 1891 నాటికి శాస్త్రి గారి గ్రంథములు 140. వీరి సాహితీ సేవకు చిహ్నముగా తే 19-11-1944న నెల్లూరు పుర మందిరంలో వీరి ఛాయాచిత్రము ఆవిష్కరింపబడినది వావిళ్ళ రామస్వామిశాస్త్రి గారు మరణించునాటికి తమ ఏకైక పుత్రుడైన వేంకటేశ్వరశాస్త్రికి ఆరు సంవత్సరాలు రామస్వామిశాస్త్రిగారి ద్వితీయ కళత్ర మగు జ్ఞానమ్మ కుమారుడు శ్రీ వేంకటేశ్వరశాస్త్రి.

వీరు 1884 లో నెల్లూరుజిల్లా అల్లూరులో జన్మించారు. రామస్వామి శాస్త్రి గారి మరణానంతరం ఈ సంస్థ రమారమి 15 సంవత్సరములు మందకొండిగా నడచినది. వేంకటేశ్వరశాస్త్రి చిన్నవారయినందున ప్రెస్ బాధ్యతలను రామస్వామిశాస్త్రి అల్లుడు శ్రీ వదలవాడ సుందరరామశాస్త్రి గారు, ఒక బేరిశెట్టి గారు నిర్వహించుచుండిరి. తర్వాత శ్రీవేంకటేశ్వరశాస్త్రి సంస్కృతాంధ్ర ఆంగ్ల భాషల నేర్చి లౌకిక వ్యవహారముల ఒంటబట్టి ముద్రణ కార్యభారము తామే నిర్వహింప సాగిరి 'ఆది సరస్వతీ నిలయ'మను పేరును 'వావిళ్ళ ముద్రణాలయము'గా మార్చిరి.

తండ్రిగారు సంస్కృతాంధ్ర గ్రంథముల ప్రకటించగా, శ్రీ వెంకటేశ్వర శాస్త్రిగారు సంస్కృతాంధ్ర ఆంగ్ల, తమిళ గ్రంథములను గూడ ముద్రించిరి. ఇందు తెనుగు గ్రంథముల ప్రచురణ ఎక్కువగా నుండెను. వీరు శ్రీరామముద్రాక్షరశాలను కొని అందు ఆంగ్ల గ్రంథములు ముద్రించుచుండిరి.

శాస్త్రిగారు వాఙ్మయ సేవచేసే రోజులలో జాతీయ ఉద్యమము ముమ్మరంగా నుండినది. తెల్లదొరలు ఉద్యమము నణగద్రొక్క యత్నించు చుండిరి. ఆ ప్రయత్నమే వంగదేశ విభజన ఆ సమయములో బంకించంద్ర చటర్జీ వ్రాసిన "ఆనందమఠ" నవలను శాస్త్రిగారు అనువదింప జేసి ప్రకటించిరి.

శాస్త్రిగారు శృంగారకావ్య ప్రచురణలలో అతివేల శృంగార వర్ణనల ప్రకటించినందులకు ఆనాడు దొరతనమువారు వీరిపై ప్రాసిక్యూషన్ జరిపిరి ఆంధ్ర విద్వల్లోకపు నిరసనతో అయ్యది ఉపసంహరింపబడినది. కాని టంగుటూరి ప్రకాశం గారి హయాములో నిషేధపుటుత్తర్వులు పూర్తిగా తొలగించబడినవి. వేంకటేశ్వర శాస్త్రిగారు తమ గ్రంథములకు నూతన రూపమొసంగ దలచినవారై, పండితుల కన్ని సౌకర్యముల కల్పించి పారితోషికము లొసంగి గ్రంథములకు, విమర్శలు, పీఠికలు, వ్యాఖ్యలు, టీకలు, పాఠాంతర పరిశీలనములు వ్రాయించి, ముద్రించుచుండిరి. ఇది మహత్తరమైన సాహితీ సమారాధనము. పరిశోధనా రంగమునకు యిట్టి సాహితీ గ్రంథము లెంతేని యవసరము

తెలుగులో వివిధ సాహిత్య ప్రక్రియలను సర్వాంగ సుందరముగా తీర్చిదిద్దినారు. శ్రీ వేంకటేశ్వర శాస్త్రి గారు. వజ్ఝలవారి వసుచరిత్ర విమర్శ. జనమంచి వారి మనుచరిత్ర హృదయావిష్కరణ, మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారి ఆంధ్ర భారత విమర్శ, శేషాద్రి రమణుల పోతన భాగవతవిమర్శ, కట్టమంచి వారి కళాపూర్ణోదయ విమర్శ. మేడేపల్లివారి ఆముక్త మాల్యద విమర్శ విశిష్ట ప్రచురణములు తెలుగు పురాణాలలో విష్ణు, నృసింహ, బసవ, మార్కండేయ వైశ్య పురాణములు, వావిళ్ళవారు వెలుగులోనికి తెచ్చినారు. 8 శతాబ్దాలలోని ప్రబంధము లన్నింటికి పీఠికలు వెలువరింపబడినవి భారత, భాగవత, రామాయణములలోని ముఖ్యఘట్టములకు టీకలు వ్రాసి పాఠకులకు సౌకర్యము కల్గించిరి. విజయ విలాసమునకు "ముకుర" మను పేర బులుసు వెంకట రమణయ్య గారిచే వ్యాఖ్య వ్రాయించి ప్రకటించిరి. వేమనపద్యముల 2800 లు సంపాదించి టీకా తాత్పర్యముంతో ముద్రించిరి. శతక గ్రంథముల నన్నింటినీ వీరే ప్రకటించిరి.

ఏ విషయమునకైనను సమగ్రతను చేకూర్చుట వావిళ్ళవారి ఆశయము. ఆ ఆశయముతో తెనుగులోని రామాయణము లన్నింటిని సేకరించి ప్రకటించిరి. తెనుగు నాటకములలో జానపదముల నెక్కువ వెలువరించిరి. అచ్చతెనుగు కావ్యములు, వచన, ద్విపద, రామాయణ, భారత, భాగవతములు మహాపురుషుల చరిత్రలు ముద్రించబడినవి. నవలలలో సాంఘిక, చారిత్రక నవలలు ప్రాముఖ్యము వహించినవి. తుమ్మల పల్లి రామలింగేశ్వరరావు గారి "తిక్కన సోమయాజి" నవల వావిళ్ళవారి ప్రచురణ. కథాపుస్తకములు అచ్చు

వేయుటలో చక్కని పద్ధతి నవలంబించిరి. వేదముల లోని కథలను సులభశైలిలో ప్రకటించిరి. తెలుగులో ఛందస్సు, అలంకార, వ్యాకరణ గ్రంథములు పలు కూర్పుల పొందినవి. అందు అప్పకవీయము, బాల ప్రౌఢ వ్యాకరణములు ప్రాచుర్యము నొందినవి. భాషాభివృద్ధికి నిఘంటువులు సాధనములని తలచి గురు బాలప్రబోధిక, సంస్కృత తెలుగు నిఘంటువు మున్నగు నిఘంటువులను ప్రకటించిరి. అందు వావిళ్ళ నిఘంటువు ప్రత్యేకముగా నంతరింపబడినది. ఈ నిఘంటు కార్యము 30 సంవత్సరములు పట్టినది. వేటూరివారి చాటువులను "చాటుపద్య మణిమంజరి" యను పేర ప్రకటించిరి. బాలవాఙ్మయములో చదల వాడ సీతారామశాస్త్రిగారి పెద్దబాలశిక్షను పునర్ము ద్రించిరి. చిన్నబాలశిక్ష, ద్రావిడబాలశిక్ష, ఆంధ్ర, కన్నడ బాలశిక్షలు ప్రకటించిరి. సంస్కృత గ్రంథము లన్నింటికి తెనుగుటీకల వెలువరించుట వావిళ్ళవారి ప్రచురణలో నూతనాధ్యాయం. సంస్కృతభాషా పరి చయములేనివారికిది అత్యంతోపయోగకరం. ఇందు వేదాంత, ధర్మ, తత్త్వశాస్త్రములు కావ్య, నాటక, అలంకార పురాణ, సాహిత్యమంతయు ప్రచురితము.

హిందూ కుటుంబమునకు అందుబాటులో నుండే విధముగా పురాణాలలోని వ్రతములను, స్తోత్రములను ప్రత్యేకముగ విడదీసి పూజాకల్పములతో ప్రకటిం చిరి. ఆయుర్వేద, జ్యోతిష, సాముద్రిక, వాస్తుశాస్త్ర గ్రంథములను అతిసులభశైలిలో ప్రకటించిరి. భగవ ద్గీత వ్యాఖ్యానములను 15కు మించి ప్రకటించిరి. అందు దివ్యజ్ఞాన సమాజ అధ్యక్షులు అనిబిసెంటు భగవద్గీతానువాదము వివిధ ప్రచురణలందినది. బ్రహ్మ సూత్రములకు వివిధ భాష్యముల సేకరించి ముద్రించిరి.

ఇక తమిళ గ్రంథాలతో వళ్ళువర్ వ్రాసిన తిరుక్కురల్, వచన రామాయణ, భారత భాగవత ములు ప్రచురించిరి. తమిళగ్రంథ ప్రకాశకులుముద్రిం చని ఓదంబరపిళ్లైగారి తొల్కాప్పియ వ్యాకరణ వ్యాఖ్యానము వీరు ముద్రించి తమ సమతాదృష్టిని వెలువరించిరి. ఆంగ్లములో బ్రౌను దొరగారి ఆంగ్లాను వాద వేమన పద్యములు, అరవిందులవారి ఆంగ్ల గీతో పన్యాసములు, తెలుగు సామెతలకు కెప్టెన్ కార్ కూర్చిన ఆంగ్లానువాదము మున్నగు గ్రంథముల ముద్రించిరి.

కేవలము గ్రంథప్రచురణయేగాక పత్రికాసంపా దకులుగా శాస్త్రిగారు పేరుపొందియున్నారు. వీరు 1916లో త్రిలింగ పత్రికయను మాసపత్రికను ప్రారంభించిరి. అది క్రమంగా వార పత్రపత్రిక యైంది ఈ పత్రిక 1941లో రజతోత్సవం జరుపు కొన్నది. 1927లో "ఫెడరేషన్ ఇండియా" అను ఆంగ్ల వారపత్రికను స్థాపించిరి. "బాలవినోదిని" యను తమిళమాస పత్రికను గూడ ప్రకటించిరి దీనికి సుబ్రహ్మణ్య భారతి సహకరించు చుండిరి. సుబ్రహ్మణ్య భారతికి అవసాన దశలో ఆర్థికముగా శాస్త్రిగారు సహకరించిరి. కట్టమంచి రామ లింగారెడ్డి గారి కుటుంబము వావిళ్ల వారికి సన్ని హితము. 1948 ఏప్రిల్ 3వ తేదీ వేంకటేశ్వర శాస్త్రి గారి షష్టిపూర్తి మహోత్సవములకు ఆంధ్ర విశ్వకళా పరిషత్ ఉపాధ్యక్షుల హోదాలో రామలింగారెడ్డి గారు అధ్యక్షత వహించిరి. కట్టమంచి వారి మూలముగా శాస్త్రిగారికి తిలక్, గాంధీ మున్నగు దేశ నాయకుల పరిచయ మేర్పడినది తిలక్ మహాశయుని భగవద్గీతా రహస్యమునుదింప చేసి వావాళ్ళ వారు ప్రకటించిరి. రాజాజీ, ప్రకాశం మున్నగు రాజకీయ నాయకులు వీరికి అతి సన్నిహితులు.

ఇంత బృహత్తరమయిన ప్రచురణ కార్యము లున్నను వారు ప్రజాహిత కార్యములపై అసక్తి చూపేవారు. చదువుకొనే ప్రతిభావంతులయిన పేద విద్యార్థులకు ఆర్థిక భోజన వసతుల ఏర్పాటు చేయు చుండిరి. ముద్రణాలయములో ఉద్యోగస్థులపై సాను

భూతి కలదు. వీరి కార్మికులు సమ్మె నెరుగరు. జీతము కాలము పట్టి గాక పనిని బట్టి నిర్ణయించుట వీరి వ్యాపార దక్షతకు నిదర్శనము. వీరు చివరి రోజులలో పక్షవాతమునకు గురియయినను ప్రెస్ వ్యవహారములు తామే చూచుకొనేవారు. వీరి గ్రంథ విక్రయశాలలు ఆంధ్రదేశములోని ప్రధాన కేంద్రాలలో వెలసియుండెడివి. ప్రాచీన సంప్రదాయకులైనను సంఘ సంస్కరణోద్యమములలో సహకార మందించేవారు.

వీరు అఖిలభారత వాణిజ్య సంఘమునకు మద్రాసు ప్రతినిధిగ మద్రాసు విశ్వవిద్యాలయ సెనేట్ సభ్యులుగ, అన్నామలై తెలుగు పరీక్షాధికారిగా, కాస్మొపొలిటన్ క్లబ్ సభ్యులుగా, చెన్నపురి ఆంధ్ర మహాసభ కార్య నిర్వాహకులుగా పదవులు నిర్వహించిరి. వీరు ప్రచురించిన గ్రంథ సూచిక 100 పేజీల పైబడిన గ్రంథము. అదియే వీరు వ్రాసిన గ్రంథ బాహుళ్యమును తెల్పును. వావిళ్లవారు సహస్రాధిక గ్రంథ ప్రకాశకులు. వీరు చేసిన భాషా సేవకు పండిత వర్యులు "శాస్త్ర ప్రచార భూషణ" "భాషోద్ధారక" బిరుదముల నొసంగినారు. 1919లో నెల్లూరు ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారు, 1946లో వర్థమాన సమాజము వారు సువర్ణ పతకమును బహూకరించిరి. 1966లో ఆంధ్ర విశ్వ విద్యాలయము వీరికి "కళా ప్రపూర్ణ" బిరుదు ప్రసాదించినది. అచంచల దీక్షతో ఇంత భాషా సేవ చేసిన వేంకటేశ్వర శాస్త్రి గారు కన్నుమూసిరి. సాహితీ లోకమునకు తీరని నష్టము కల్గినది. వాఙ్మయరంగము ఊషర క్షేత్రమయినది. తర్వాత ఈ సంస్థలో వాఙ్మయ వికాసాభివృద్ధి అనుకొన్నంత జరగలేదు. ట్రస్టీ సంఘమేర్పడి ప్రచురణ కలాపములు [illegible] వ్యాజ్యములు ఏర్పడి [illegible] ట్రస్టీ ఈ సంస్థను చూచుచుం[illegible] 20 సంవత్సరములు అవి [illegible] పూర్వప్రతిష్ఠ [illegible] కోల్పోయినది. 19[illegible] ఈ సంస్థ కార్యక్రమములను తిరిగి యథాతథంగా సాగించుటకు రామస్వామి శాస్త్రి గారి దౌహిత్రులయిన అల్లాడి సుబ్రహ్మణ్య శాస్త్రి గారి కుమారుడు అల్లాడి స్వామినాథన్ గారు పునరుద్ధరించుటకు కృషి చేయుచున్నారు నవంబరు 8వ తేది మద్రాసులో శతవార్షికోత్సవము జరుపుకొన్నది

డా॥ ఉడాలి నరసింహశాస్త్రి
తెలుగు లెక్చరర్,
వేద మరియు సంస్కృత పాఠశాల,
మూలపేట్,
నెల్లూరు-524003.

# కమనీయ కవితావనాల ముకురాల

'గాలి దయ్యం గగనమంతా ఊపేసింది. ఇంటి కప్పులు దూదిపింజల్లా ఎగిరిపోయాయి. చెట్లు పిటపిట కూలిపోయాయి. బాటలూ, తోటలూ భీభత్సంగా తయారయ్యాయి. అనేకమంది జలసమాధి అయ్యారు' ఇది 1977 లో తూర్పుకోస్తా చెప్పిన కన్నీటి కథ.

వలస కూలీలు తూర్పుకోస్తాకు వెళ్ళిన పాలమూరు (మహబూబునగర్) జాలర్లు కొందరు ఆ తుపానులో తుదిశ్వాస వదిలారన్న వార్తవిని ఓ కలం కన్నీరు కార్చింది.

'ఎన్నడొస్తవు లేబరీ! పాలమూరి జాలరీ!
పత్రికల్లో రేడియోల్లో పాడువార్తలు చదువుతుంటే
కంటినీరే జాలువారే నీ ఇంటిదేమో కుములుతుంటది
ఎక్కడుంటివి లేబరీ! ఎన్నడొస్తవు జాలరీ!'
అని

ఆ కలం కన్నీటి పాట పాడింది. పల్లె పదాల పొదులో ప్రభవించిన ఆ కలం కులం జిహ్వా మతం మట్టి అంటని ముకురాల రామారెడ్డి గారిది.

మహబూబ్‌నగర్ జిల్లాలోని ముకురాల అనే మారు మూల పల్లెలో జన్మించి పల్లెపదాలతో కవితామాలలల్లి తెలుగుతల్లి నలకరించారు ముకురాల గారు, ఉద్యోగ రీత్యా పట్నంలో స్థిరపడినా తల్లి ప్రేమలాంటి పల్లె సీమంటేనే వారికి మక్కువ. జాతికి హృద్యమైన జాన పదులంటేనే వారికి అభిమానం.

ప్రాచీన తెలుగు సాహిత్యంపై పరిశోధన చేసి డాక్టర్ పట్టానందుకొన్న సరస్వతీ మూర్తులు ముకు రాల. ఆనాటి ఆంధ్ర సారస్వత పరిషత్ ఉద్యమా ల్లోనూ, తెలంగాణా రచయితల ఉద్యమాల్లోనూ వీరు పాల్గొన్నారు. ప్రస్తుతం తెలుగు అకాడమిలో డిప్యూటీ డైరెక్టర్‌గా పని చేస్తున్నారు.

డా॥ ముకురాల రామారెడ్డి గారి సంపాదకత్వంలో పరిపాలన న్యాయపదకోశం (ఇంగ్లీషు—తెలుగు) వెలు వడింది, ప్రభుత్వ కార్యాలయాల పత్ర వ్యవహారానికి ఈ పదకోశం ఉపకరిస్తుంది. అధికార భాష త్వరగా అమలులోకి రావాలన్న సంకల్పంతో తెలుగు అకాడమి ఈ పదకోశాన్ని వెలువరించింది.

ముకురాల గారికి ఉర్దూ, తెలుగు సారస్వతాల్లోని లోతుపాతులు బాగా తెలుసు. వీరి ప్రతి రచన సూటిగా, ఘాటుగా హృదయానికి తగిలి ఆలోచింప చేస్తుంది. సునిశిత హాస్యం ద్వారా వీరు సమాజంలోని చీకటి వెలుగులను చక్కగా చిత్రించారు.

ఒక సభలో ప్రముఖకవి హనుమచ్ఛర్మ గారూ, ముకురాల గారూ తమతమ పద్యాలు చదివితే, సుర వరం ప్రతాపరెడ్డి గారు విని 'ఈ యువకులు రాజ కీయాల్లో ప్రవేశించకుండా ఉంటే కవిత్వం బాగా రాస్తారు" అన్నారట. ఆమాట నేటికి ఆశీర్వచనంలా, ఆదేశసూత్రంలా జ్ఞప్తికివస్తూ ఉంటుందంటారు రెడ్డి గారు.

ముకురాలగారి గళం ముగ్ధమనోహరమైన పల్లె పదాలు పాడింది. ఫీరికవిత్వం మధురకవోష్ణమై,మంచి నీటి ప్రవాహమై జాలువారింది. మేఘమాత, దేవర కొండదుర్గం, హృదయశైలి, నవ్వేకత్తులు ఇందుకు నిదర్శనాలు. "మేఘమాత" గేయానువాదం సరళ మైన తెలుగులో ఎంతో సహజంగా సాగింది.

వీర రసానికి ప్రతీక "దేవరకొండ దుర్గం". కమ నీయ కవితాహృదయానికి ప్రతిబింబమే "హృదయ శైలి". స్వప్రయోజనాలకోసం రకరకాల ఆయుధాల్ని సమాజంపై ప్రయోగించే వారి ఆలోచనలే నవ్వే కత్తులు:

"సంస్కార విహీనమతులసరిదిద్దుటయే సత్కృతి
సత్కృతినెదిరించు జనుల సంహరించుటొక
సత్కృతి
అదినేమెచ్చినసత్కృతి, అదియే నా ఆవిష్కృతి"

అని తమ కవితా హృదయాన్ని ఆవిష్కరించారు రెడ్డిగారు.

"దేశమిట్లే బాగుపడునోయ్" అనే కవితలో

"లక్షణమే లేని వారుకు
లక్ష రేషన్‌కార్డు లిస్తే
పూటగడువదు అంటరేమిటి

ఓటువుణ్యానికేనారా?" సూటిగా, ఘాటుగా ప్రశ్నిస్తారు. వోటుకు అమ్ముడుపోయే ప్రజలకి మాటలు కనువిప్పు కలిగిస్తాయి.

"ఓటుకేమో ధరలు ముద్దా ?
సీటుకేమో ధరలుపెద్దా ?
ఓటునూ, సీటునూ నిలిపే
సేటు వరుకుకు ధరలు వద్దా?" అని

అంటారు అదేకవితలో. వోట్లు వేయించుకొని వోటర్ల బాగోగులు మరిచిపోయే బడానాయకుల గుండెల్లో గుచ్చుకునేగునపాలివి. ఎన్నికల ముందు ఎన్నెన్నో వాగ్దానాలుచేసి ప్రజల జీవితాలను దగ్ధంచేసేనేతలను నిరలావేటాడే సిజాలివి.

"మైత్రియొకటియేమనుష్యుల మతమైవర్థిలగావలె
మైత్రినిసహజీవనమును మానవసంస్కృతియన
వలె"

మైత్రీబంధమే అసలు సిసలైన మానవ సంస్కృతి అని ప్రబోధిస్తున్నారు.

వైజ్ఞానికంగా ఎదగవలసిన మనిషి కుల, మత, వర్గ పోరాటాలతో సతమతమవుతున్నాడని అలాంటి మనిషిని మేల్కొలిపే విధంగా నేటి యువకవులు రచించాలనీ, ప్రజాస్వామ్య విలువలనూ, మానవతా వాదాన్నీ తెలియచేసే రచనలే రావాలనీ ఈ కవి మన సారా ఆశిస్తున్నారు.

అలతి అలతి పదాలతో అంతరంగాన్ని రంగరించి అనేక కవితలు రచించారు రెడ్డిగారు. అక్షరాల గారడీ లతో అస్పష్టమైన భావాలతో పాఠకులను తికమక పెట్టక, చదువగానే చప్పున అర్థమయ్యే ముకురాల కవితలు అణిముత్యాలు వివిధసాహితీ సంస్థలలో సభ్యులుగా ఉండి వీరు చేసిన సేవలు చిరస్మరణీయాలు.

సి. బి. కృష్ణ
H. No 12-11-1082/2,
వారాసిగూడ
సికింద్రాబాద్-500 861.

## దక్షిణ భారత హిందీ ప్రచార సభ- ఆంధ్ర, హైదరాబాద్
## హిందీ ప్రచారకులకు మనవి

ఫిబ్రవరి పరీక్షలు ముగిసినవి. ప్రారంభిక పరీక్షల ఫలితములు మార్చి మాసాంతమునకు ప్రకటించు ప్రయత్నములు జరుగుచున్నవి. కేంద్ర ప్రభుత్వము వారి ప్రణాళికలకు సంబంధించిన గ్రాంటు సొమ్మును పంపు కార్యక్రమము ఈ మాసములోనే పూర్తిచేయవలసి యున్నది. కాన మహావిద్యాలయ, విశారద విద్యాలయ, టంకణ విద్యాలయ, నిశ్శుల్క హిందీవర్గ నిర్వాహకులు అవసరమైన పత్రములు 15-3-1987 లోగా పంపి గ్రాంటు పొందగోరుచున్నాము అటు తరువాత వచ్చు పత్రములను పరిశీలించుట సంభవము కాదని మనవి.

ఇట్లు
ఎ. రామస్వామి
కార్యదర్శి




## నామదేవుడు

మాధవ గోపాల్ దేశ్‌ముఖ్
భారతీయ సాహిత్య నిర్మాతలు
సాహిత్య అకాడమీ
రవీంద్ర భవన్, న్యూఢిల్లీ—110001
వెల 4-00

భారతీయ సాహిత్యంలో వివిధ భాషా తత్త్వ వేత్తలను, రచయితల గురించి తెలియజేసే గ్రంథాల జాబితాలో వచ్చినదీ గ్రంథం. 1970 నవంబర్ మాసంలో నామదేవుయొక్క 700వ జయంత్యుత్సవాలు దేశమంతటా జరిగాయి. ఆ సందర్భంగా ప్రచురింపబడింది. 13వ శతాబ్దంలోని మహాసాధుపుంగవులలో నామదేవుడు ప్రథముడు.

ఆధ్యాత్మిక తత్త్వాన్ని, వేదాంత విషయాల్ని ప్రచారం చేసిన వారిలో నామదేవుడు అగ్రగణ్యుడు. వేదాంతాలకు మూలకందాలయిన సిద్ధాంతాలను వర్తమాన యుగానికి యితడే అందించాడు. మహారాష్ట్ర దేశంలో సంప్రదాయ బద్ధంగా వస్తున్న కృష్ణభక్తి గురుదత్తాత్రేయ భక్తి తత్వాన్ని నామదేవుడు సర్వలోకానికి తెలియజేశాడు. నామదేవు మరాఠీలో, హిందీలో పంజాబీలో మిశ్రితమయిన హిందీ కీర్తనలు భక్తిరస కందాయాలు. ఆయన జీవితమే ఒక ధార్మికాదర్శం. సత్యాల మూట- ధర్మపు రాచబాట,

నామస్మరణ చేసేవానికి
యముడు కూడా వందనం చేస్తాడు—

అంటాడు నామదేవుడు. పండరీనాథుని గురించి ఆలోచించిన అంతర్ముఖుడు. సద్గురువు శరణుపొందమంటాడు. నామదేవు జీవితం గురించిన అనేక ఆసక్తికర విషయాలిందు పొందుపరచబడినవి. జీవితకథ చమత్కారాలు; రచనలు; వేదాంతం; కవిత్వం; వ్యక్తిత్వం; అనే విభాగాల ద్వారా నామదేవుని జీవిత సర్వస్వం అందించబడింది. నామదేవుడు రచించిన గ్రంథాల సూచిక చివరలో యివ్వబడింది. ఇంకా అతనిపై వ్రాసిన 33 విమర్శ గ్రంథాల జాబితా, హిందీ, ఇంగ్లీషు గ్రంథాల వివరాలు యివ్వబడింది. అందరూ చదువవలసిన గ్రంథం.

## రోజులు మారాలి

(స్త్రీ పాత్రలేని నాటిక)

రచన : ఐతా చంద్రయ్య
పల్లవి ఆర్ట్స్ ప్రచురణ
ప్రతులకు:-
ఐతా చంద్రయ్య
ఇం. నెం. 4-4-11.
షేర్‌పురా- సిద్దిపేట. 502 103

ఆధునిక సమస్యల్ని ప్రతిబింబిస్తూ సమకాలీన జీవనాన్ని చిత్రించే నాటిక యిది కేవలం అయిదు పాత్రలతో నడిచే నాటిక, శంకరభవాని నడుమ నడుమ హాస్యం గుప్పిస్తూ నాటికను రసవంతం

చేస్తాడు. భార్యా భర్తల మధ్య అతి సున్నితమైన సమస్యలను నవ్విస్తూ పరిష్కరిస్తాడు రచయిత. తెలుగు పలుకుబడులపై, తెలుగు వారి జీవనముపై వీరికున్న మమకారం ఈ నాటికలో స్పష్టంగావుంది. ప్రతి డైలాగులోను హాస్యం తొంగి చూస్తుంటుంది. పాత్రల పేర్లు కూడ గమ్మత్తుగా వున్నాయి. అర్ధనారీశ్వర్, రాజారాణి, శంకరభవాని, మహామాయ, చెంగల్వారాయ వీరితెవ్వరికీ మీసాలుండవు. యీ నాటికలో ఒక్కొక్కరొక్కొక్క విధంగా హాస్యం అందిస్తూ వినోదం కలిగిస్తారు స్టేజిమీద వేయడానికి చాలా సులువు సెట్టింగుల బాధలేదు డైలాగుల మీద వినోదం కలిగిస్తూ, కాలక్షేపం చేయించే యీ నాటికను ఎవరు ప్రదర్శించినా రచయిత అనుమతి తీసుకోవాలి సిద్దిపేటలోని పల్లవి ఆర్ట్స్ వారు ప్రచురించారు దీనికి యండమూరి వీరేంద్రనాథ్ అభిప్రాయం సర్టిఫికెటు లాంటిది.

# ఆత్మనివేదనము

రచయిత:— పతి వేణుగోపాలశర్మ

'సాహిత్య రత్న'

'ఆత్మ నివేదనము' రామచంద్ర ప్రభూ అన్న మకుటంతో వ్రాయబడింది. లలిత లలితమైన పదములతో ఆధునిక రాజకీయ సాంఘిక పరిస్థితులను సునిశిత వ్యంగ్యంగా మందలిస్తూ వ్రాశారు. విశిష్ట భావనా పూరిత హృదయార్తి యీ పద్యాలలో వుంది. 'నీవే గతి' అనే అన్యధా శరణం మమ' భావాన్ని "ఇతరం బెనియు వాంఛ సేయనిక" పద్యంలో యిమిడ్చినాడు. శ్రీరామచంద్రుని దివ్య లీలా మానుష విగ్రహుని ధనుష్మంతుని కీర్తిస్తాడు. పూర్ణేందు ప్రభ లీను నెమ్మొగముతో అన్న పద్యంలో ఆర్తితోపాటు తాత్త్విక చింతన, యీయనలో పారమార్థికత పొంగుతుంది. పంచభూతాత్మకమైన పరమేశ్వర తత్వాన్ని, అఖండతేజో రూపుని దర్శిస్తాడు కవి. మంచి భాషా శక్తి, భావనాగరిమ పుష్కలంగా వుంది. కవిలో భక్తితో పాటు నివేదన గూఢమై వుంది. శ్రీరాముని కటాక్షము యీ కవిగారి మీద పూర్ణంగా వున్నది. మాయా ప్రపంచమున జరుగు అద్భుతాలను, మానవ బలహీనతలను వివరిస్తాడు. కవిగారి షష్ట్యబ్ది సందర్భముగా, అత్యంత భక్తి శ్రద్ధంతో 108 పద్య ప్రసూనములను శ్రీరామ చరణాబ్జములందుంచి వినమ్రుడైనాడు. చక్కగా చదువుకోటానికి వీలగు, లలిత పదశోభితమైన వాక్యాలిందున్నవి. అందరూ చదువ తగినది. ఆధ్యాత్మ పరులకు, జిజ్ఞాసువులకు ఇది సహకారి, మధునాపంతులవారి అభిప్రాయము, ఈ శతకానికి అలంకార ప్రాయము. అవ్యయానంద గ్రంధమాల ప్రచురించిన 18వ పుస్తకమిది,

# భువన మోహినీ విలాసము

(ద్విపద)

పెన్గలూరి వెంకటాద్రి,

సంపాదకులు :- కపిలవాయి లింగమూర్తి

వెల : 12 00

(తిరుపతి దేవస్థానంవారి ఆర్థికసహాయంతో ముద్రితము)

ఇది గద్వాల సంస్థానమునకు చెందిన పెన్గలూరి వెంకటాద్రి రచించిన ద్విపదకావ్యము— తిరుపతి వెంకటేశ్వరునికి అంకితమైనది. అష్టాదశాదివర్ణనలు వున్న యీ గ్రంధం శృంగారరసభరితమైనది. నాయికా వర్ణనము- యౌవనోదయము-వివాహము - జలక్రీడలు — మన్మథ, నిశాభూషణము- ప్రణయము- రకుల్ని ఆకర్షిస్తాయి వైజయంతీ విలాసము. తారాశశాంకము- బిల్హణీయము వంటి ప్రబంధాలలోని నాయికవంటిదే భువనమోహిని.

గుహవైన మందుకు భువనమోహిని అందచందాలకు భ్రమించి కాముకుడౌతాడు. కోరికతీర్చమని వేధించిన గుహుడు బారినుండి సూర్యుడు కాపాడుతాడు.-

కోరికతీరని గురువు మరణిస్తాడు-చంద్రశర్మ బ్రహ్మ రాక్షసుడిగా మారినవృత్తాంతం, ఆము క్తమాల్యదలోని బ్రహ్మరాక్షసిని తలపింపజేస్తుంది-సుకీర్తి మహారాజు జయసేనునికి-భువనమోహినికి వివాహం గావిస్తాడు. సిద్ధుడు వ్రాసిన చిత్రపటం చూసిన భువన మోహిని చిత్తవికారాన్ని చక్కగా వర్ణించారు. స్త్రీ, పురుషుల వేషాలను వర్ణించడం జరిగింది. భువనమోహిని విలాస విభ్రమాలు పాఠకుల్ని గిలిగింతలు పెడతాయి.

భువనమోహినీ విలాస గ్రంథానికి శ్రీకపిలవాయి లింగమూర్తిగారు చక్కని సంపాదకీయం వ్రాశారు. ఈ వరకే 6 గ్రంథాలకు సంపాదకులుగా వ్యవహరించారు-మంచిపండితులు - వ్యుత్పన్నులు - విమర్శనా చణులు. అనేక గ్రంథాలతో పోలికలు, చూపెట్టారు. తెలుగు సాహిత్యంలో యీ ద్విపద ప్రబంధానికి వీరు చేసిన విమర్శ కరదీపిక వంటిది-ఇంకా అనేక గ్రంథాలను వెలువరించగల సమర్థులు. వీరి సాహితీ పరిశోధనలో ఎన్నో మాణిక్యాలు బయటపడగలవని ఆశిద్దాం—

యస్. రామానుజాచారి

## దక్షిణ భారత హిందీ ప్రచార సభ- ఆంధ్ర, హైదరాబాదు
## స్వర్ణజయంతి పరిచయ పరీక్షలకై కృషి చేయుచున్న ప్రచారకులకు మనవి

వందనములు. తమవంటి దీక్షగల ప్రచారకుల కృషి ఫలితంగా ఇప్పటికి దాదాపు 1, 50 000 (లక్షా ఏబది వేలు) ల మంది విద్యార్థులు స్వర్ణజయంతి పరీక్షకు హాజరయి ప్రవేశ పత్రములు పొందియున్నారు. ఈ సంవత్సరం అక్టోబరు నాటికి తమ అందరి సహకారంతో ఈ సంఖ్య 2, 00, 0´0 (రెండు లక్షలు) ల లక్ష్యాన్ని చేరుకోనగలదని విశ్వసిస్తున్నాము. అంతేగాక పరిచయ పరీక్షలో ఉత్తీర్ణులయిన విద్యార్థులు భాషాజ్ఞానము పెంపుదలకై వారిని సభ ప్రారంభిక పరీక్షలలో కూర్చొనుటకు ప్రోత్సహించవలసినదిగా కోరుచున్నాము.

ఇట్లు

ఎ. రామస్వామి

కార్యదర్శి



## జాతీయ శీలాన్ని, జాతీయ సంస్కృతిని నిర్మించడానికి జాతీయభాష ఆవశ్యకత

ఆర్థికమంత్రి శ్రీ పి. మహేంద్రనాథ్ అభిభాషణ

హైదరాబాదులోని ఖైరతాబాదు నందు దక్షిణ భారత హిందీ ప్రచార సభ- ఆంధ్రలో జరిగిన హిందీ విజయపత్ర వితరణోత్సవ సభలో ముఖ్య అతిథిగా పాల్గొన్న ఆంధ్రప్రదేశ్ ఆర్థిక శాఖా మంత్రి గౌ. శ్రీ పి. మహేంద్రనాథ్ దేశంలో జాతీయ భావాన్ని జాతీయ శీలాన్ని, జాతీయ సంస్కృతిని నిర్మించి పెంపొందించడానికి ఒక జాతీయ భాష మిక్కిలి అవసరమని, జాతీయ భాషగా ఉండడానికి కావలసిన అర్హతలు హిందీకి సంపూర్ణంగా ఉన్నాయనీ, కానీ మన దేశంలో పద్నాలుగు భాషలను జాతీయ భాషలనడం విలక్షణంగా ఉన్నదనీ అంటూ దేశానికి ఒక జెండా ఒక జాతీయ గీతం ఎలానే ఒక జాతీయ భాష ఉండాలని పేర్కొన్నారు. వారు తమ ఉపన్యాసంలో విప్లవమనే శబ్దాన్ని నిర్వచిస్తూ అంతకు పూర్వం ఉన్న వ్యవస్థను పూర్తిగా నిర్మూలించి నూతన వ్యవస్థను ఏర్పరచడం విప్లవమనీ, స్వాతంత్ర్యం వచ్చిన నాడే బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పరచిన పాలనా వ్యవస్థను, దానితో పాటు వారి భాషను తొలగించి నూతన వ్యవస్థను నిర్మించి జాతీయ భాషను ప్రకటించి ఉండవలసిందనీ, అలా చేయక మన నాయకులు పెద్ద తప్పు చేశారని ఆ తప్పు పరిణామాన్ని మనం అనుభవిస్తూ ఉన్నామనీ స్పష్టం చేశారు. రాష్ట్రంలోని పాఠశాలల్లో ఆరు, ఏడు తరగతులలో హిందీ బోధనను తొలగిస్తూ ప్రభుత్వం చేసిన నిర్ణయం వారి దృష్టికి తీసుకురాగా ఆ విషయమై పునరాలోచన చేయవచ్చునన్నారు.

ఈ సభలో ఉపన్యాసకులుగా పాల్గొన్న కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖ సలహాదారు శ్రీ యస్. ఆర్. సింహ తమ దక్షిణాది అనుభవాలు ఆధారంగా ఇక్కడి ప్రజలు జాతీయ భాష హిందీ విషయంలో ప్రేమాభిమానాలు కలిగి ఉండటంతో పాటు వివేచనాత్మక దృష్టి కలిగి సమతూకంతో వ్యవహరిస్తున్నారని అన్నారు. భారత ప్రభుత్వం దేశ సమైక్యతను, సమగ్రతా పరిరక్షణకు జాతీయ భాష హిందీ ఆవశ్యకతను గుర్తించి వ్యవహరిస్తోందని అంటూ ఐక్యత అనేది భావాత్మకంగానే గాక నిర్మాణాత్మకంగానూ, సాంస్కృతికంగానూ మన దేశ జీవితంలోని ప్రతి అంశంలోనూ ప్రతిబింబించి స్పష్టం చేసేదిగా ఉండాలని అంటూ తమ దక్షిణాది పర్యటనలో ఎక్కడా ప్రజలలో జాతీయ భాష హిందీకి వ్యతిరేకత కనిపించలేదని అన్నారు. ఎక్కడకు వెళ్ళినా హిందీ ఎడ అనురాగం వ్యక్తం చేయటమే గాక సహాయం కోరుతున్నారని అంటూ సమైక్యతా ధ్యేయంతో సహాయం చేయడం ప్రభుత్వ ధర్మం అన్నారు. శ్రీ సింహ గారు తమ ప్రసంగంలో కేంద్ర ప్రభుత్వం గ్రాంటులు మంజూరు చేసే విధానాన్ని స్పష్టం చేశారు.

సభకు అధ్యక్షత వహించిన ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ఉన్నత విద్యాశాఖ డైరెక్టరు కుమారి యస్. అహమ్మద్ బీబీ గారు హిందీ మన దేశంలో అధిక

సంఖ్యాకులు మాట్లాడే భాషే గాక ప్రపంచంలో ఎక్కువ మంది మాట్లాడే మొదటి ఐదు భాషల్లో హిందీ ఒకటనీ దానిని నేర్చుకోవడం సులభమనీ జాతీయ భావంతో దానిని నేర్వవలసిందని ఉద్బోధించారు.

దక్షిణ భారత హిందీ ప్రచార సభ స్నాతకోత్తర విభాగ రిజిష్ట్రారు శ్రీ వేమూరి ఆంజనేయ శర్మగారు తమ విభాగం కార్యకలాపాలను పేర్కొని కంప్యూటర్ కోర్సులో అది చేయుచున్న కృషిని వివరించారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆరు, ఏడు తరగతుల్లో హిందీ బోధనను తొలగించడంవల్ల కలిగే పరిణామాలను పేర్కొంటూ ఉత్తర భారతదేశంలో ఒక దక్షిణాది భాషను నేర్వవలసిన అవసరాన్ని నొక్కి చెప్పారు.

హైదరాబాదు హిందీ ప్రేమీ మండలి అధ్యక్షులు శ్రీ చవాకుల నరసింహ మూర్తిగారు అతిథులకు స్వాగతం పలుకుతూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆరు, ఏడు తరగతులలో హిందీ బోధనను తొలగించడం వలన ఏర్పడిన పరిస్థితి వివరించారు.

మంత్రి శ్రీ మహేంద్రనాథ్ విద్యార్థులకు బహుమతులు, సర్టిఫికెట్లు అందజేశారు.

విద్యార్థుల ప్రార్థనతో సభ ప్రారంభమైంది. హిందీ ప్రేమీ మండలి ఉపాధ్యక్షులు శ్రీ గోదా తిరుమలయ్య గారు ధన్యవాదాలు చెప్పారు.

జాతీయ గీతాలాపనతో సభ ముగిసింది.

## విజయవాడలో హిందీ ప్రచారకుల బృహత్ సమావేశము

1-2-1987 ఆదివారము మధ్యాహ్నం 8 గంటలకు విజయవాడలోని మాచవరం దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర హిందీ మీడియమ్ కాలేజి భవనములో, ప్రచారకుల బృహత్ సమావేశము జరిగింది. బి.ఇ.డి కాలేజి ప్రారంభోత్సవం సందర్భములో దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్రశాఖ వారు యేర్పాటుచేసిన యీ సభకు దక్షిణ భారత హిందీ ప్రచార సభ మద్రాసు, ఉపాధ్యక్షులు శ్రీ ఎమ్.ఎస్. రామచంద్రన్‌గారు అధ్యక్షతవహించిరి. ముఖ్య అతిథిగా కేంద్రప్రభుత్వమువారి విద్యా సలహాదారు శ్రీ ఎస్. ఆర్. సింహాగారు పాల్గొన్న యీ సభకు, పి.జి. సెంటరు రిజిష్ట్రారు శ్రీ వేమూరి ఆంజనేయ శర్మగారు, ఆంధ్రశాఖ అధ్యక్షులు శ్రీ వేమూరి సుబ్బారావుగారు, కార్యదర్శి శ్రీ అన్నదానం రామస్వామిగారు, కేంద్రసభ కార్యదర్శి పి. అనంతకృష్ణన్‌గారు మొదలగు ప్రముఖులు కూడ హాజరైరి. ఆహూతులందరికీ కార్యదర్శి రామస్వామిగారు స్వాగతం పలికిరి. ప్రార్థనానంతరం సభను ప్రారంభిస్తూ కార్యదర్శి రామస్వామిగారు సమావేశము ప్రాధాన్యతను తెలియజేస్తూ ఇట్లనిరి—

హిందీ భాషా ప్రచారకులకు తమ కార్యరంగంలో ఎదురౌతున్న ప్రస్తుత సమస్యలను గురించి విచారించుటకు యీ సమావేశము యేర్పాటు చేయబడినది గాన మీరు, మీమీ సమస్యలను గురించి, భాషాభివృద్ధికి తీసుకోవలసిన చర్యలను గురించి క్లుప్తముగా వివరించవలసిందనిరి.

ప్రథమంగా ఆంధ్రశాఖ అధ్యక్షులు శ్రీ వేమూరి సుబ్బారావుగారు, ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారక మండలి అధ్యక్షులు శ్రీ కాజ వెంకటేశ్వరరావుగార్లు, ముఖ్య అతిథులను పుష్పమాలాలంకృతులనుచేసి, ఆంధ్రప్రదేశ్‌లో హిందీ భాషాభివృద్ధికి కొనసాగుచున్న కృషిని వివరిస్తూ, అందుకు అవసరమైన మరికొన్ని వసతులను కల్పించవలసిందిగా కోరుచున్న నివేదికలు వేరువేరుగా సమర్పించిరి.

అనంతరం పశ్చిమగోదావరిజిల్లా కృష్ణా జిల్లా గుంటూరు జిల్లాల ప్రచారకమండలుల కార్యదర్శులు

షేక్‌ఇమామ్, కొడాలి రామారావు, సి. హెచ్ కె. హరనాథశర్మగార్లు సభాధ్యక్షులైన శ్రీ ఎమ్. ఎన్. రామచంద్రన్‌గార్ని పూలమాలలతో అలంకరించిరి.

ఈ సమావేశములో ఆంధ్రశాఖ ఉపాధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావుగారు మాట్లాడుతూ—ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లో, రాష్ట్రప్రభుత్వం వారు అవలంబించిన హిందీ భాషావిధానమువలన భాషాభివృద్ధి బాగాకుంటుపడే అవకాశమున్నందున, యీ విషయమై కేంద్రప్రభుత్వమువారు మరింత శ్రద్ధతీసుకొని భాషావికాస ప్రణాళికలకు తోడ్పడవలసిందిగాకోరిరి. బి అంజయ్యగారు, పి. సుబ్బారావుగారు వగైరా ప్రచారకులు కూడ సభలో ప్రసంగించిరి శ్రీ అంజనేయశర్మగారి సందేశానంతరం అధ్యక్షులు శ్రీ రామచంద్రన్‌గారు, ఆంధ్రశాఖవారు విజయవాడలో యేర్పాటుచేసిన యీ ప్రచారకుల సమావేశము తనకు చాల సంతోషము కలిగించినదనియు, మీ రందరూ యిచ్చిన సలహాలను పాటించి, సభకార్యక్రమములను ప్రోత్సహించుటకు, కేంద్రసభద్వారా, శక్తికొలది కృషిచేస్తాననియు చెప్పిరి. కేంద్ర ప్రభుత్వము వారి విద్యాసలహాదారు, ముఖ్యఅతిథి అయిన శ్రీ ఎస్.ఆర్. సింహాగారు మాట్లాడుచూ, ప్రచారకులు యీ సమావేశములో ప్రస్తావించిన సమస్యలన్నింటిని, తాను అవగాహన చేసుకొన్నాననియు, అందుకు అనుగుణంగా, ప్రయత్నించుటకు యీ సంస్థలకు వలయు సహకారము, కేంద్రప్రభుత్వము ద్వారా అందించుటకు నా శాయశక్తులా కృషిచేస్తానని హామీయిస్తూ ప్రచారకులకు ఉత్సాహపూరిత సందేశమిచ్చిరి. రాష్ట్ర గానముతో సభ జయప్రదంగా ముగిసింది.

## హిందీ ప్రమాణపత్ర వితరణోత్సవం సదాశివపేట

5-1-1987వ తేదీ సోమవారము సాయంత్రము 6గం॥కు ఆంధ్రప్రదేశ్ గురుకుల పాఠశాల సదాశివపేట మెదక్ జిల్లా హిందీ పండితులు శ్రీ ఎస్. లక్ష్మణ్‌రావుగారు హిందీ ప్రమాణపత్ర వితరణోత్సవము జరిపారు. పాఠశాల హిందీ సారస్వత సంఘం ఆధ్వర్యములో జరిగిన ఈ ఉత్సవానికి ప్రిన్సిపాల్ శ్రీ కె. బాలగోపాల్ ప్రసాద్ అధ్యక్షత వహించారు. ప్రమాణపత్ర వితరణోత్సవమునకు స్థానిక డిగ్రీ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ వెంకటప్పగారు విచ్చేసినారు. హిందీ ప్రాముఖ్యత, జాతీయ సమైక్యత సాధనలో హిందీ భాష వహించె పాత్రగురించి జూనియర్ కళాశాల హిందీ ఉపన్యాసకులు శ్రీ లక్ష్మయ్యగారు ఉపన్యసించారు. తరువాత హిందీ ప్రచారకులు శ్రీ ఎన్. లక్ష్మణ్‌రావుగారు, తెలుగు పండితులు శ్రీ ఎన్. సీతాపతిగార్లు హిందీ భాషాపరిజ్ఞానము గురించి స్వీయానుభవములతో ముచ్చటగ ఉపన్యసించారు. "సారె జహాసె అచ్చా..." గీతముతో ప్రారంభమైన ఈ సమావేశము "జనగణమన" జాతీయ గీతముతో ముగిసినది.

## రిపబ్లిక్ దినోత్సవం మరియు పరిచయ పరీక్షా ప్రారంభోత్సవము కొత్తపట్నం

ప్రకాశంజిల్లా కొత్తపట్నం గ్రామంలో చైతన్య విద్యావనం, ఆదర్శ గురుకుల పాఠశాలలో రిపబ్లిక్ దినోత్సవం మరియు ప్రథమ పరిచయ పరీక్షా తరగతుల ప్రారంభోత్సవము, 26-1-87న జరిగినది. తొలుత విద్యాలయ కరస్పాండెంట్ మరియు ప్రధానోపాధ్యాయులు శ్రీ గొ॥ నరజర్ల వెంకటేశ్వర్లు గారు జెండావందనము గావించిరి.

తదుపరి సభకు వారు అధ్యక్షతాసనము అలంకరించగా, విద్యాలయ హిందీ పండితులు ప్రార్థన గీతముచేసి నాటిసభ ప్రాముఖ్యం. నేటివిద్యా విధానంలో రాజకీయ విధానం హిందీరద్దు వలన జరుగనున్న నష్ట, కష్టాలను వివరించిరి. తొలుత ఈ విద్యా

లయంలో ప్రారంభదశగా, హిందీ ప్రచారం చేయుటకు, హిందీ నేర్పుటకు, పరిచయ పరీక్ష ప్రాముఖ్యత గురించి దానిని నిర్వహించుటతో ద. భా. హిందీ ప్రచారసభవారి ఉద్దేశ్యమును వివరించిరి తొలివిడతగా హిందీ తరగతుల నిర్వహణకు అనుమతించిన కరస్పాండెంట్‌గార్కి పత్రికరపున కృతజ్ఞతాభివందనములు తెల్పిరి. గురుకుల పాఠశాల సాంఘిక ఉపాధ్యాయులు, శ్రీ సయ్యద్ సాదక్‌గారు, సామాన్య శాస్త్ర ఉపాధ్యాయుల శ్రీ కె పోలిరెడ్డిగారు M Sc గార్లు హిందీ ప్రాముఖ్యత గురించి, దానిని నేర్చుకొన్నందున తమకు కల్గిన లాభాలు గురించి వివరించిరి.

సభ అధ్యక్షులు శ్రీ N. వెంకటేశ్వర్లు BSc BEd గారు రిపబ్లిక్ దినోత్సవం, నేటి విద్యార్థుల కర్తవ్యం, హిందీ ఆవశ్యకత గురించి చక్కగా విద్యార్థులకు వక్కాణించిరి. విద్యార్థులు తొలిదశగా దాదాపు 60 మంది ఉత్సాహంగా, పరిచయ పరీక్షకు హాజరు అయినారు

విద్యార్థులకు తీపిఋతాయి పంపిణి తదుపరి రాష్ట్రీ గీతముతో నాటి సభ ముగిసినది.

## భీమవరంలో త్రిదండి శ్రీ శ్రీ శ్రీ చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామిచే శ్రీ మహాభారత వైజ్ఞానిక సమీక్ష గ్రంథావిష్కరణము

*భీమవరం:-* స్వర్గీయ శ్రీమత్తిరుమల వేంకట శ్రీనివాసాచార్యుల రచించిన శ్రీ మహాభారత వైజ్ఞానిక సమీక్ష గ్రంథాన్ని శ్రీమదుభయ వేదాన్తాచార్య పీఠాధిపతి వేద విశ్వవిద్యాలయ అధిపతి, పరమహంస పరివ్రాజికాచార్య శ్రీశ్రీశ్రీ చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి ఆవిష్కరించారు. స్థానిక ఛాంబర్ ఆఫ్ కామర్స్ హాలులో. శ్రీనివాస భారతి అధ్వర్యంలో ఈ నెల 18వ తేదీన ఈ సభ జరిగింది.

శ్రీ జీయర్ స్వామి ఈ గ్రంథాన్ని గూర్చి ప్రసంగిస్తూ భారతాది గ్రంథాలు మన భారతీయ సంస్కృతికి మూల కందాలని, వీటి మహత్తర యదార్థ తత్త్వ స్వరూపాలు నేడు మరుగున పడిపోయాయని మానవాళిని తరింప జేసే విలువైన పరమార్థాన్ని లోకానికి చాటి చెప్పే శ్రీ మహాభారత వైజ్ఞానిక సమీక్షవంటి దివ్య గ్రంథం దేశానికి ఎంతైనా అవసరమని అభిభాషించారు. మహాభారత పరమార్థాన్ని వ్యాసమహర్షి ఆశయాన్ని తెలిపే గ్రంథాలలో ఇదే మొదటిదై మనకు ఆ కొరతను తీరుస్తోందని చెప్పారు. భారతంపై దాడిచేసే విమర్శకులకు ఇది ఒక చక్కని సమాధాన గ్రంథం కాగలదని మోక్షమార్గం ఎవరికి వారు అన్వేషించు కొనేలా చేసె ఈ దివ్య గ్రంథాన్ని ప్రతి భారతీయుడు తప్పక సరిగ చదివి, భావితరాలకోసమైనా తన ఇంటిలో భద్రపరచుకోవాలని హితవు చెప్పారు.

శ్రీ జీయర్ స్వామి తమ ఉపన్యాసం కొనసాగిస్తూ మహాభారతం నాలుగు వేదాల సారమన్నారు. లోక వినాశనానికి దారి తీస్తున్న ఆధునిక విజ్ఞానం మన వేద వాఙ్మయంలోని ఒక అక్షరానికైనా సరిపోదని చెబుతూ, గ్రంథకర్త భారత వైజ్ఞానిక సమీక్షలో తెలిపిన విజ్ఞానం ఇంటర్నల్ సైన్స్ అన్నారు. దీనిని మననం చేసుకొంటే లోక శ్రేయస్సు కలుగుతుందని సందేశమిచ్చారు

దూర ప్రాంతాలనుంచి సైతం వచ్చిన కవి పండిత ప్రజలతో నిండిన ఈ మహాసభను ఆంధ్రప్రదేశ్ ఎక్సైజ్ కమీషనర్ శ్రీ పి వి ఆర్ కె ప్రసాద్ I A S అధ్యక్ష స్థానంలో ఎంతో హుందాగా సమర్థవంతంగా నిర్వహించారు

జాతీయాచార్య (National Professor) శ్రీ యస్వీ జోగారావు తమ 'అభిజ్ఞాన శాకుంతలము-

కాళిదాసు అంతర్యము అనే కృతిని శ్రీమాన్ శ్రీనివాసా చార్యుల వారికి అంకితం చేసి, సభా ప్రారంభం చేసారు.

శ్రీ మహాభారత వైజ్ఞానిక సమీక్ష గ్రంథంపై వచ్చిన ప్రముఖ కవి పండితుల అభిప్రాయాలను స్థానిక కస్తూరిబా జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ సాగి వాసుదేవరాజు సభలో నివేదించారు.

పండిత శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులు గ్రంథవైశిష్ట్యాన్ని గూర్చి ఉపన్యసించినారు. డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావు, డా॥ రామడుగు వేంకటేశ్వర శర్మ గ్రంథకర్తకు కవితా నీరాజనం సమర్పించారు.

కళాభిమాని శ్రీ బండా నాగేశ్వరరావు శ్రీ చిన్న జీయర్ స్వామివారిని, సభలో పాల్గొన్న తదితర కవి పండితులను అపూర్వమైన రీతిలో ఘన సత్కారం చేసారు.

శ్రీనివాస భారతి వ్యవస్థాపకులు, కార్యక్రమ నిర్వాహకులైన శ్రీ యన్. టి. వి. రాజగోపాలా చార్యులు శ్రీ జీయర్ స్వామికి, అతిథులకు సభ్యులకు తొలుత స్వాగతం పలికారు. శ్రీ భారత వైజ్ఞానిక సమీక్ష గ్రంథ ప్రకాశకులైన వీరు గ్రంథకర్తలు తమ తండ్రిగారు అయిన శ్రీ శ్రీనివాసా చార్యులవారి స్మృతి దీపికగా శ్రీ చిన్న జీయర్ స్వామివారిచే స్థాపించబడిన వేద విశ్వ విద్యాలయానికి (జీయర్ ట్రస్టుకు) రూ. 1,116 లు (వెయ్యి నూట పదహారు రూపాయలు) విరాళంగా సమర్పించారు.

శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి మంగళాశాసనములతో సభ ముగిసింది.

## వరంగల్ జిల్లా హిందీ ప్రచారక సమ్మేళనము మరియు హిందీ ప్రమాణపత్ర వితరణోత్సవము

## 23-12-1986

స్థానిక మహబూబియా పంజేతన్ జూనియర్ కళాశాలావరణలో ది. 23–12–86 సా॥ 6 గంటలకు హిందీ ప్రచారక సమ్మేళనము ముఖ్యఅతిథి ఎ. రామస్వామి కార్యదర్శి దక్షిణ్ భారత్ హిందీ ప్రచార సభ, ఆంధ్ర, హైదరాబాద్ మరియు డా సి. హెచ్. రాములు హిందీ విభాగాధ్యక్షులు కాకతీయ విశ్వవిద్యాలయము, వరంగల్ వారి అధ్యక్షతన ప్రారంభమైనది. వేదికపై శ్రీ కడారు మల్లయ్యగారు శిక్షక్ సంఘటక్ తెలంగాణ, డా॥ మాధవరావు గారు కాకతీయ విశ్వవిద్యాలయ హిందీ విభాగాధ్యక్షులు, మొ॥ మహబూబ్ షరీఫ్ పంజేతన్ జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్, శ్రీ యం. జగన్నాథా చార్యులు తెలుగు ఉపన్యాసకులు, పంజేతన్ కళాశాల, శ్రీ షేక్ హుసేన్ గారు, గౌరవార్ధ కార్యదర్శి హిందీ విశారద విద్యాలయము వరంగల్, శ్రీ బి. పార్థసారథి గారు ప్రిన్సిపాల్ ప్రభుత్వ బాలికా జూనియర్ కళాశాల వరంగల్, శ్రీ సయ్యద్ హుసేన్ గౌరవార్థ కార్యదర్శి హిందీ ప్రేమీ మండలి వరంగల్, వారందరు ఆసీనులైరి.

తొలుత శ్రీ సయ్యద్ హుసేన్ గారు గౌరవార్థ కార్యదర్శి హిందీ ప్రేమ మండలి వారి స్వాగతోపన్యాసముతో సభ ప్రారంభమై పూలమాలతో ఆహ్వానితులను సత్కరించిరి సభయొక్క నిర్దిష్ట కార్యక్రమమును, ప్రయోజనమును గురించి తెలుపుతు, హిందీ భాషా ప్రయోజనమును గురించి మాట్లాడవలసినదిగా
ఉపన్యాసకులను కోరిరి.

మొదట సభాధ్యక్షులగు డా॥ సి హెచ్. రాములు గారు తమ ఉపన్యాసమును ప్రారంభిస్తు హిందీ రాష్ట్రీ

వ్యాప్తంగా చాలా సరళమైనదనియు, అది భారతీయ ఏకాత్మకతకు మూలమనియు. మిక్కిలి ప్రయోజన కారియనియు, ఎందరో మహా కవులచే సుసంపన్న ముగా చేయబడిన భాషయనియు దాని బహుళ ప్రయో జనమును గూర్చి విశదీకరించిరి. తదుపరి ఎ. రామ స్వామి గారు కా॥ ద॥ భా॥ హిం॥ సభవారు హిందీ భాషాభివృద్ధికి తమ సభ యేవిధముగా పనిచేయు చున్నదో వివరించుచు సరళ సుందరమగు భాషలో అనర్గళముగా యుపన్యసించిరి. తదుపరి శ్రీ కదారు మల్లయ్య మృదుమధుర ఉపన్యాసము ద్వారా నేటి కాలమున హిందీ భాషా ప్రయోజనమును గూర్చి విశ దీకరించిరి పిదప మ. మాధవరావు గారు తమ మధుర కవితా ధోరణిలో గంగా సదృశ ప్రవాహ వేగంతో హిందీ భాషా మాధుర్యమును చవిజూపుతూ దాని సౌందర్య సారళ్యాలను గూర్చి చక్కగా నుపన్యసిం చిరి. ఆ పిమ్మట శ్రీ పార్థసారథి గారు, మరియు శ్రీ M. జగన్నాధా చార్యులు భాషా ప్రయోజనం, హిందీ భాష బహుముఖ ప్రయోజనముల గూర్చి యుపన్యసించిరి. దీని తదుపరి ప్రమాణ పత్ర విత రణోత్సవం దిగ్విజయముగా జరిగినది. విద్యార్థులకు ప్రమాణ పత్రములు శ్రీ ఎ. రామస్వామి గారి కర కమలములద్వారా విద్యార్థులకు యీయబడినవి తదు పరి హిందీ విశారద విద్యాలయము తరపున 121/ రూ. లు నగదురూపంలో స్వర్ణజయంత్యుత్సవ నిధిగా శ్రీ రామస్వామిగారికి యీయబడినవి చివరకు శ్రీ షేక్ హుసేన్ గారి కృతజ్ఞతా వచనములతో జనగణ మణ గీతముతో సభ పరిసమాప్తి గావింపబడినది.

## విజయవాడ హిందీ మహావిద్యాలయ స్నాతకోత్సవము

పై మహావిద్యాలయం స్నాతకోత్సవం 7-2-19 87 శనివారం సాయంత్రము, హిందీ మీడియం బి. ఇడి కాలేజి ఆచార్యులు శ్రీ మిక్కిలినేని సుబ్బారావు గారి అధ్యక్షతన జరిగింది. ప్రిన్సిపాల్ కాజ వెంకటే _ రావు గారు ఆహూతులకు స్వాగతం చెప్పిన అనంతరం, ఆర్. విజయదుర్గ, సి. హెచ్. లక్ష్మి, జె. సుజాతగార్ల ప్రార్థనా గీతంతో సభ ప్రారంభ మైనది. ప్రార్థనానంతరం, విజయవాడ బ్రాంచి మేనే జరు శ్రీ P. ప్రసాదరావు గారు సభను ప్రారంభిస్తూ, మహా విద్యాలయం స్థాపనా వివరములు చెప్పుచూ దక్షిణ భారత హిందీ ప్రచార సభ వారి కార్య కలాప ములు వివరించిరి. ముఖ్య అతిధి శ్రీ మిక్కిలినేని సుబ్బారావు గారు తన సందేశములో, హిందీ భాష కున్న ప్రాధాన్యతను వివరించిరి. అనంతరము హిందీ డిబేట్‌లో విజేతలైన విద్యార్థినీ విద్యార్థులకు బహు మతు లందజేసిరి.

*ప్రథమ బహుమతి గ్రహీతలు*

(1) పి. వి. సురేష్
(2) జి. శ్రీనివాసరావు
(3) యు. గోపి

*ద్వితీయ బహుమతి గ్రహీతలు*

(1) సయ్యద్ ఫిరోజ్ పాషా
(2) డి. సునీత
(3) బి. స్వర్ణ

*తృతీయ బహుమతి గ్రహీతలు*

(1) బి. యస్. హరనాథ్
(2) కె హనుమ కిషోర్
(3) యల్ వి ఆదిలక్ష్మి

ఆహూతులకు, విద్యార్థినీ, విద్యార్థులకు, విద్యా లయం ఉపాధ్యాయినులు శ్రీమతి పి ప్రభావతీ దేవి, సి హెచ్ కామాక్షి గార్లు అల్పాహార విందుకు తగు యేర్పాట్లుచేసిరి. ఛాయాచిత్రం తీయబడిన అనంతరం సభ జయప్రదంగా ముగిసింది.

## రవీంద్ర హిందీ ప్రేమీమండలి, ఉంగ్రాజవరం, ప. గో. జి. వార్షికోత్సవము

ది. 26. 1. 1987 పశ్చిమ గోదావరి జిల్లా ఉంగ్రాజవరంలో రవీంద్ర హిందీ ప్రేమీ మండలి 25వ వార్షికోత్సవము జరుపబడినది. విద్యార్థి పోడూరి సోమేశ్వర రావు ప్రార్థనా గీతముతో సభ ప్రారంభము అయినది. ఆనాటి సభకు శ్రీ కుదప సత్యనారాయణ B.A B. Ed గారు అధ్యక్షత వహించిరి. రవీంద్ర హిందీ ప్రేమీ మండలి వ్యవస్థాపకులు మరియు ప్రథమశ్రేణి హిందీ ప్రచారకులు శ్రీ కరుటూరి సూర్యనారాయణ గారు వార్షిక రిపోర్టును చదివిరి.

హిందీ అధ్యాపకురాలు శ్రీమతి జగన్మోహిని రాణి (హిందీ శిక్షణ పారంగత్) దేశ సమైక్యతకు హిందీ భాష ఎంతైనా అవసరమని ప్రసంగించినారు. 1986 ఆగష్టులో జరిగిన హిందీ పరీక్షలలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు శ్రీ కుదప సత్యనారాయణ గారు ప్రమాణ పత్రములు అందజేసిరి; అధ్యక్షులు మాట్లాడుతూ రవీంద్ర హిందీ ప్రేమీ మండలి మూడు పూవులు, ఆరుకాయలుగా వర్థిల్లటానికి కారణము శ్రీ కరుటూరి సూర్యనారాయణ గారి కృషియే అని శ్లాఘించారు ఆటల పోటీలలో గెలుపొందిన విద్యార్థులకు బహుమతులు అందజేసి వారిని ఆశీర్వదించారు. హిందీ అధ్యాపకురాలు శ్రీమతి జగన్మోహినీ రాణి వందన సమర్పణతో సభ జయప్రదముగా ముగిసినది.

## హిందీ మహా విద్యాలయము, గాంధీపర్వతము విజయవాడ-1 రిపబ్లిక్ డే దినోత్సవము గాంధీజీ వర్ధంతి ఉత్సవము

26-1-1987 తేదీ ఉదయం 8 గం. 30 ని లకు గాంధీ పర్వతముమీద రిపబ్లిక్ దినోత్సవ సందర్భమున జండా వందన కార్యక్రమం జరిగింది. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు గాంధీ పర్వత సంస్థ కోశాధ్యక్షులు డా. శ్రీ దమ్మాలపాటి రామారావు గారు జాతీయ జండా ఎగురవేసారు. ఈ సందర్భములో వారు తమ సందేశం ఇస్తూ ఈనాడు యువతీ యువకులు, దేశపౌరులు ఆనాటి త్యాగాల్ని దృష్టిలో పెట్టుకొని దేశ సమైక్యతకోసం, సమగ్రత కోసం కృషి చెయ్యాలని, జాతివిచ్ఛిన్న కరశక్తులను విఫలం చెయ్యాలని ఉద్బోధించారు. ప్రముఖ ప్రకృతి వైద్యులు, ఆచార్య శ్రీ కొలిపాక ఆదినారాయణ శర్మ గారు దేశం ఎదుర్కొంటున్న ప్రమాదకర పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని యువతీ యువకులు దేశ రక్షణకు నడుం కట్టాలని ప్రబోధించారు హిందీ విద్యాలయ పథాన అధ్యాపకులు శ్రీ చర్ల జనార్ధనస్వామి కార్యక్రమం నిర్వహించారు. గాంధీపర్వత సంస్థ హిందీమహావిద్యాలయ విద్యార్థినీవిద్యార్థులు, అధ్యాపక బృందము గాంధీ పర్వత సంస్థ కార్యకర్తలు, తదితర సభ్యులు దీనిలో పాల్గొన్నారు.

తదనంతరం జరిగిన హిందీ ప్రమాణపత్ర వితరణ కార్యక్రమానికి వయోవృద్ధ గాంధేయ వాది శ్రీ వైద్యుల నారాయణ దాసు గారు అధ్యక్షత వహించారు. విద్యాలయ ప్రధాన అధ్యాపకులు విద్యాలయము నుండి అగస్టు 1986 పరీక్ష పరీక్షార్థుల రిపోర్టు

తెలుపుతూ ప్రారంభిక పరీక్షలలో 157 మంది హాజరైనారని వీరిలో 14 మంది ప్రథమ శ్రేణిలోను 38 మంది ద్వితీయ శ్రేణిలోను ఉత్తీర్ణులైనారని, ఉన్నత పరీక్షలలో 119 మంది హాజరుకాగా 87 మంది ఉత్తీర్ణులైనారని చెప్పారు. రిపబ్లిక్ దినోత్సవ సందర్భంలో విద్యాలయంలో నిర్వహించబడిన హిందీ వక్తృత్వం, క్విజ్ పోటీలలో గెలుపొందిన వారికి శ్రీ కొలిపాక ఆదినారాయణ శర్మ గారు బహుమతి వితరణ చేసారు. శ్రీ వైద్యుల నారాయణ దాసు గారు విద్యాలయము నుండి ప్రాథమిక, మధ్యమ, రాష్ట్ర భాష పరీక్షలలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు ప్రమాణ పత్ర వితరణం చేసారు. వందన సమర్పణానంతరం 'జనగణ' గీతంతో కార్యక్రమం ముగిసింది.

30-1-1987 తేదీ సాయంకాలం 5 గం 30 ని॥ లకు గాంధీ పర్వతం మీద స్తూపం వద్ద గాంధీజీ వర్ధంతి సందర్భములో సర్వమత ప్రార్థన జరిగింది. ప్రముఖ గాంధేయవాది శ్రీ ఉప్పులూరి రామశాస్త్రి గారు అధ్యక్షత వహించారు. విద్యాలయ ప్రధాన అధ్యాపకులు శ్రీ చర్ల జనార్దన స్వామి ప్రార్థనా కార్యక్రమం నడిపారు. విద్యాలయ అధ్యాపక బృందం విద్యార్థినీ, విద్యార్థులు, తదితరులు కార్యక్రమంలో పాల్గొన్నారు. ప్రేమచంద్ పబ్లికేషన్ వ్యవస్థాపకులు శ్రీ కండికొండ సూర్యనారాయణ శాస్త్రి గారు, ప్రకృతి వైద్యులు ఆచార్య కొలిపాక ఆదినారాయణ శర్మ గారు, ఉర్దూకవి శ్రీ జార్ ముజాఫర్ సర్వోదయ మహిళా కార్యకర్త శ్రీమతి చర్ల బాపాయమ్మ ఈ కార్యక్రమంలో పాల్గొని గాంధీజీ ప్రబోధించిన సత్యాహింసలను, త్యాగనిష్ఠను, సేవా తత్పరతను మత సామరస్యములను అలవర్చుకొనవలసిన ఆవశ్యకతను గురించి ప్రబోధించారు. ప్రార్థనానంతరము గాంధీజీకి అమరవీరులందరికి శ్రద్ధాంజలి సమర్పించటం జరిగింది. తదనంతరం గాంధీ పర్వత సంస్థ వారు ఏర్పాటు చేసిన ధ్వని ప్రకాశ ప్రదర్శనను దర్శించటంతో కార్యక్రమము ముగిసింది.

౦

# యాజమాన్యం తదితర వివరాలు

# నవం

[ఫారం 4. (3వ నిబంధన) ప్రకారము]

| | | |
|---|---|---|
| 1. ప్రచురణ స్థలం | - | 6-2-959, ఖైరతాబాదు, హైదరాబాదు. |
| 2. ప్రచురణ వ్యవధి | - | మాసపత్రిక |
| 3. ముద్రాపకుని పేరు | - | ఎ. రామస్వామి |
| జాతి | - | భారతీయుడు |
| చిరునామా | - | 6-2-959, ఖైరతాబాదు, హైదరాబాదు |
| 4. సంపాదకుని పేరు | - | ఎ. రామస్వామి |
| | - | భారతీయుడు |
| చిరునామా | - | 6-2-959, ఖైరతాబాదు, హైదరాబాదు-4 |
| 5. పత్రిక యజమానులు | - | దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర, 6-2-959, ఖైరతాబాదు, హైదరాబాదు-4 |

పై వివరములు నాకు తెలిసినంత వరకు వాస్తవమైనవని ఇందుమూలముగా తెలియ జేయుచున్నాను.

హైదరాబాదు
తేది 1-3-1937

ఎ. రామస్వామి
ప్రకాశకులు

# దక్షిణ భారత హిందీ ప్రచారసభ- ఆంధ్ర

## స్వర్ణోత్సవాలు-1987
## సేకరించవలసిన నిధి వివరములు

సభ ప్రారంభిక పరీక్షార్థుల నుండి-ఒకొక్కరికి రూ. ౨-౦౦

సభ ఉన్నత పరీక్షార్థుల నుండి-ఒకొక్కరికి రూ. ౫-౦౦

ప్రచారకులు, పరీక్షార్థులు తాము పంపు పరీక్షా రుసుముతో పాటు ఈ విరాళములను కూడా ఆంధ్రసభకు పంపవలసినదిగా ప్రార్థించుచున్నాము.

ప్రారంభిక పరీక్షార్థుల విరాళమును పరీక్షా రుసుము మరియు దరఖాస్తు ఫారములతో పాటు ఆంధ్రసభకు పంపగలరు.

ఉన్నత పరీక్షార్థుల విరాళము మాత్రము ఆంధ్ర సభకు పంపి పరీక్షా రుసుము మరియు దరఖాస్తు ఫారములు మద్రాసు కేంద్రసభకు పంప ప్రార్థితులు.

ఎ. రామస్వామి

కార్యదర్శి

Edited, Printed and Published by A. Ramaswamy on behalf of the D.B. Hindi Prachar Sabha-Andhra.-9 Khairatabad, Hyderabad-500 004.